


సచిత్ర మాస పత్రిక

7 ఎ. శివాజీ స్ట్రీట్

టి. నగర్, మద్రాసు-17.

ఫోన్ : 442001

విడి ప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 9

జూలై 1971

సంచిక 7

సంస్థాపకులు :

కీ. శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్ :

శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

Edited and Published by Smt, V. Leelavaty and Printed by Sri K Damodaram at Sri Kala Printers, 83, Lake view Road, Madras-33




ముఖచిత్రం

పూర్ణ ఆర్ట్ పిక్చర్స్

'కూతురు-కోడలు' లో

శోభన్‌బాబు




# క్లీర్‌టోన్-సాటిలేని విద్యుత్ ఉపకరణాలు

'క్లీర్‌టోన్' రకరకాల విద్యుత్ ఉపకరణాలకు పెట్టింది పేరు. నాణ్యమైన ఈ ఉపకరణాల వెనుక, ఏళ్ళ తరబడి సాధించిన తయారీ అనుభవం ఉన్నది. అందుకే దేశమంతటా వేల కొద్దీ గృహిణులు 'క్లీర్‌టోన్' ఉపకరణాలనే వాడుతున్నారు.
మీ సొమ్ముకు తగ్గ విలువగల వస్తువులు కావాలంటే, 'క్లీర్‌టోన్' విద్యుత్ ఉపకరణాలనే కొనండి. ఈ ఉపకరణాల సర్వీస్ కొరకు దేశమంతటా 1,500 కు పైగా క్లీర్‌టోన్ డీలర్లు విస్తరించిఉన్నారు.




ది [illegible] రేడియో & ఎలెక్ట్రానిక్స్ కంపెనీ లిమిటెడ్ (జనరల్ రేడియో & ఉపకరణాల [illegible]) ఢిల్లీ కలకత్తా మద్రాస్

# తొలిమాట

బానిసత్వ విముక్తికై స్వాతంత్ర్య సమరం సాగించే వీరులను చూచి మురిసి పోవటమే కాని, సహాయం యిసుమంతైనా వుండదు—మేమూ స్వాతంత్ర్య పోరాటంలో గెలుపొందిన వారిమనే వారికి—వాచా సానుభూతి మాత్రం అతి మెండు.

బంగ్లాదేశ్ గురించి అందరితో బాటు మనమూ సోదర భారతీయులమంటూ అనునయ వాక్యాలు పలుకుతున్నాం, విచారిస్తున్నాం - వార్తలు చదువుతున్నపుడల్లా. మన నుంచి యిసుమంతయిన సహాయం వున్నా—కనీసం నూరు మందికో మర తుపాకీ-పాకిస్తాన్ నియంతృత్వాన్ని నిశ్చింతగా ముంచెత్తుండేవారు. వారూ భారతీయులేగా—మనవారి ధైర్య సాహసాలు వారికీ వున్నాయిగా!....కానీ, తేడా ఒకటే - మన పార్లమెంటు తికమకలు వారికి తెలియవు. బంగ్లాదేశ్ పేరు చెప్పి అరవై లక్షలు కాదు కదా—అర పైసా కూడా బ్యాంకు నుంచి దోచుకోలేదు. వారి నిత్య కర్తవ్యం—పాకిస్తాన్ నియంతృత్వపు కబంధ హస్తాల నుండి విముక్తి, భారతీయుల కంటే సిసలైన స్వాతంత్ర్య వీరులుగా ఆధునిక యుగానికి నాంది పలకటం వారి వంతు ... భావితరాల వారు బంగ్లాదేశ్ స్వాతంత్ర్య సమర గాధను జ్ఞప్తి చేసినపుడు తలొంచుకోవటం మన వంతు!....

* * *

నిశ్చలన చిత్రాలతో మరో సరికొత్త శీర్షిక 'జ్యోతి' పాఠక లోకానికి. రాబోయే సంచిక నుంచే ప్రారంభం.

* * *

లంక దీవి దహనంలో రాక్షస స్త్రీల జోలికే పోలేదు కోతి చేష్టల కోతి మూకలు. కానీ. దైవత్వాన్ని నింపుకొన్న అమాయకురాలికే అన్యాయం జరిగి పోయింది - రాక్షసుల్లాటి మానవుల కబంధ హస్తాల్లో....పవిత్ర పుణ్యస్థలిలో....ఏది లంకాదహనం....?

—చూ. పే. 9

* * *

'తుది మాట' ను అందిస్తున్న శ్రీ ప్రత్యేగాత్మగారు అనివార్య కారణంగా ఈ నెల వారి మాటను పాఠకులకు మేము అందించలేక పోయాం. ఆగస్టు నుంచి మామూలే!

* * *




శ్రీమతి లీలావతి గార్కి,

'జ్యోతి'ని మీరు అభివృద్ధి చేస్తున్న విధము - కొంగ్రొత్త శీర్షికలద్వారా గమనార్హము. పత్రికకు మీ చేతిలో ఉజ్వల భవిష్యత్తుని చూస్తున్నాను.

—ప్రో॥ దత్తాత్రేయ, రాజమండ్రి-2

డియర్ ఎడిటర్,

'జూన్' సంచిక సర్వాంగ సుందరంగా తయారైంది. పవని నిర్మల ప్రభావతి 'కాకి-కోకిల' బెస్ట్. వల్లూరి విజయకుమార్ 'గొడుగు' బెటర్, మిగతా కథలు గుడ్.

శ్రీ ప్రత్యేగాత్మగారి 'తుది మాట', శ్రీమతి సూర్యకాంతంగారి 'ప్రశ్నలు-జవాబులు'. శ్రీ వ్యాసచంద్‌గారి 'వాస్తవ గాథలు 'శీర్షికలు మా కెంతో హాయినిస్తున్నాయి.

—పరిపూర్ణ.

శ్రీమతి లీలావతి రాఘవయ్యగార్కి,

మీ శ్రమకు ప్రతిఫలం 'జూన్'సంచికలో స్పష్టంగా తెలుస్తూ వున్నది. మీరు ఎంత శ్రమ పడివుంటే జూన్ సంచికను యింత బాగా తీసుకొని రాగలగివుండేవారు!! ఇకనుంచి ప్రతి సంచిక యింతకంటే మిన్నగా తీసుకురండి. ఇంకా కొత్త శీర్షికలు ప్రవేశపెట్టండి. కార్టూనులు, జోకులు మాకు నవ్వునిచ్చాయి.

—కె. వి. ఆర్. రాజు, బొంబాయి.

ఎడిటర్ గారికి,

'జూన్' జ్యోతి చదివాను. వి. ఆర్. శశిధరుడిగారి కథలో (58 వ పేజిలో) పిరిప్రే అని ప్రచురించారు. అది పిరిప్రే కాదు, పింప్రీ. పూనాలో అత్యధిక పరిశ్రమలు ఇక్కడే ఉన్నాయి. ఇక్కడున్నన్ని పరిశ్రమలలో నగం కూడా పూర్తి ఆంధ్ర ప్రదేశ్‌లో లేవేమో! ఇక మొత్తం మహారాష్ట్రలోని పరిశ్రమలతో పోలిస్తే 'ఆంధ్ర'లో వెయ్యిలో ఒక వంతుకూడా ఉండవేమో? ఇంతకీ ఇది ఎందుకు చెప్పొచ్చానంటే అంత ప్రాముఖ్యమైన 'పింప్రీ', 'జ్యోతి' పాఠకులకు వివరంగా తెలియాలనే.

"థ్యాంక్స్ టుది రైన్' ప్రచురించినందుకు "థ్యాంక్ టు ది ఎడిటర్."

ఇట్లు

—ఎ. ఎన్. మల్లయ్య, పింప్రీ

* అచ్చు తప్పుని గ్రహించ గలరు.

# ★ "సుధల జల్లు" ★

పి. బి. శ్రీనివాస్

(స) భావాలకు పుట్టినిల్లు తెలుగు భాష
పలువన్నెల వానవిల్లు తెలుగుభాష
అంతులేని సుధలజల్లు తెలుగుభాష
అద్వితీయ మనగజల్లు తెలుగుభాష।

(రి) తెలుగు తీపినే పాడును పాటల
పులుగు
తెలుగు, మదికి హాయి గొలుపు
వెన్నెల వెలుగు
తెలుపు కన్న నిర్మలమై వెలసెను
తెలుగు
తెలివి గలిగి తెలుగు చదువ
జ్ఞానము కలుగు।

(గ) నవనీతమటన్న తెలుగు మృదు
పదజాలం
అవనీతల సురద్రుమం
తెలుగు రసాలం
మంచిమనిషి మనసు కన్న
తెలుగు విశాలం
మార్పులెల్ల గొనుచు నిలుచు
నిల కలకాలం।

(మ) తెలుగు వంటి మరొక భాష
జగతిని లేదు
తెలుగు ముందు తీయదనమె
ఎంతో చేదు
తెలుగటన్న వట్టిమాట కానేకాదు
తెలుగు విలువ పసిడికైన
రానేరాదు।।

(ప) తెలుగు క్రొత్తదనము లూరి
ఉబికెడు ఊట
తెలుగు సుంతయైన చెక్కుచెదరని
కోట
తెలుగు పరిమళాలు విరియు కవితల
తోట
తెలుగుకు నవనీరాజన మీనా పాట।

(ధ) తలపుల కుసుమాల భవ్యహారము
తెలుగు
వలపు రుచుల మరపించెడు క్షీరము
తెలుగు
నలువ సృష్టి విలువ తెలుపు కీరము
తెలుగు
పలుకుల చెలి పలుకు
పలుకు సారము తెలుగు

(ని) కల్పనకును అందరాని తీరము
తెలుగు
కవిత మోయలేని అర్థభారము
తెలుగు
నిర్గుణ గుణ వర్ణన కాధారము
తెలుగు
నిఖిల లోకభాషల శ్రీ నుడికారము
తెలుగు

క్రొత్తరకం పజిల్

# ★ రు. 1,000 లు గెలుపొందండి

## శ్రీ భాస్కర్ పజిల్ - 2

వేపరాల (P. o.) : : కడప (జిల్లా)

ప్రవేశ రుసుము రు. 1-00 ముగింపు తేది 25. 7. 71.

ఆల్ కరెక్టు రు. 500 లు. ఒక తప్పుకు రు. 300 లు.

ఆల్ మిస్టేక్సు రు. 100 లు. ఇంకా కన్సలోషన్ బహుమతులు

**ఆధారములు :**

(1) నేడు చాలామంది యువకులు స్త్రీ (బాహ్యసౌందర్యాన్ని—అంతర సౌందర్యాన్ని) ఆరాధిస్తున్నారు (2) నేటి యువతరం సినిమాలు చూసి (చెడి పోతున్నారు—బాగుపడుతున్నారు) (3) అపజయం పొందేకొద్దీ కొందరిలో విజయం పొందాలనే కాంక్ష (ఎక్కువౌతుంటుంది—తగ్గిపోతుంటుంది) (4) స్త్రీలు ఎక్కువగా (పూలు—ఆభరణాలు) కోసం ఆరాటపడతారు (5) ఈ లోకమంతయు (ధనము—భగవంతుని) ఆధీనమైయున్నది (6) పురుషుడు (కాంత—ధనము) కు దాసుడు (7) ప్రభుత్వ నిర్వహణ యందు జరుగు ప్రతిపని (అలస్యముగా జరుగును—సక్రమముగా నుండదు) (8) (మొండివాణ్ణి—డబ్బుగలవాణ్ణి) ఎవరు ఏమి చేయలేరు.

**నిబంధనలు :**

1. ఎక్కువమంది పోటీదార్లు ఎన్నుకొన్న పదాలనుబట్టి విజేతలను నిర్ణయించ బడును. స్వంత నిర్ణయము మేము చేయము. 2. కూపను ఒక్కొంటికి ప్రవేశరుసుము రు. 1-00. M. O. ద్వారా రుసుము పంపించవలెను. 3. ఒకరు ఎన్ని కూపను లైనను ఒక కవరులోనే పంపుతూ వాటి మొత్తం ఒకే M. O లో పంపవచ్చును. 4. ముగింపుతేదీన కూడ కూపనులు పోస్టు చేయవచ్చును. 5. నాలుగు ఎంట్రీలు పంపినవారు అయిదవ ఎంట్రీని ఉచితంగా పంపవచ్చును. 6. ఫలితము, విజేతల పేర్లు వచ్చే సంచికలో ప్రకటింపబడును. 7. విజేతలకు టెలిగ్రాం ద్వారా తెలుప బడును. 8. ముందుగా అందిన ఎంట్రీలకు ప్రత్యేక బహుమతులు యివ్వబడును. 9. అన్ని విషయములలోను మేనేజిమెంట్ వారిదే తుది నిర్ణయము.

మేనేజరు — భాస్కర పజిల్ — వేపరాల - కడప జిల్లా.



# లంకాదహనం

ఎ వి సీతారామమూర్తి

'గవర్నమెంటోళ్ళు ప్రొహిబిష నెత్తేశాక నువ్వు బతికి బాగు పడ్డావులే గంగన్నా ఇన్నాళ్లూ ఎంత సంపాదిస్తున్నా దొంగ చాటేపారమే గందా— దన నాయాల్లు తాగిన పెతివోడో పోలీసాడినే లెక్క చెయ్య కుండ మురుకూతలు కూయడం, పట్టుబడ్డం, నీ కొంప మీదకి తేడం, వారానికి ఒకటో రెండో సార్లు ఆ పోలీసోళ్లను తడిపే సరికి నీ లాబాలు గూబల్లో కొచ్చేవి— పోన్లే నీ అదురుష్టం బావుంది–నీయాపారం నిలిచింది. మాకూ యీ బయాలు పోనాయి– యేదీ మరో గ్లాసందుకో...''
అంటూ తాగి ఖాళీ చేసిన గ్లాసును కర్ర టేబిల్ మీద పెట్టి ఆవులించాడు జోగులు.

గంగన్నకీ రకం సానుభూతి మాటలు రోజూ అలవాటై పోయాయి ఓ గ్లాసేసు కున్న ప్రతి వాడూ తనను గురించి మాటాడతాడు. అంతే—అంత వరకే రెండో గ్లాసెక్కిందా! ఆపలేం - వాళ్ళ మాటలు, వాళ్ళ పాటలు, వాళ్ళ లోకమే వేరు

నింపిన గ్లాసును మళ్ళీ నిముషంలో ఖాళీ చేసి నిషాలోకి దిగి జోగుతూ యింటి దారి పట్టాడు జోగులు

నిండుగా ఊపిరి పీల్చుకొని గల్లాపెట్టి కన్నార్పకుండా చూశాడు. గూట్లోని దీపం బుడ్డి లేత కాంతులు ఆమె ముఖంలోని అమాయికతను వ్యక్తం చేస్తున్నాయి

లోపలున్న నులక మంచం కొట్లో వేసుకుని, దుప్పటి పరచుకుని కూర్చు న్నాడు గంగన్న బేరం సన్నగిల్లి పోయి నట్లే అనుకొని కొట్లోని పెద్దలైటు చిన్నది చేసి, తలుపు మూసి, నడుం వాల్చాడు

ఎంత వద్దనుకున్నా రత్తాలి రూపం తన కళ్ళలో అలానే నిల్చిపోయింది— లోకమంటే ఏమిటో పూర్తిగా తెలియ

**పుణ్యస్థలి అరాచకాలతోనే పావనమఌతూ వుంటుందా? అమాయకులు దైవత్వాన్ని పొందటం-కిరాతకుల కబంధ హస్తాల్లోనలిగిపోవటమేనా?**

ముందు నించి లేచాడు గంగన్న రాత్రి పది దాటినట్లుంది అక్కడక్కడ సద్దు మణిగినా వూరింకా పూర్తిగా నిద్దరోలేదు తాగినవాడి కళ్ళలా ఎర్రగా మత్తులో మునిగి తేల్తోంది

పెట్టెలోని డబ్బంతా మరోసారి లెక్క చూసుకుని లోపలికి నడిచాడు గంగన్న నులకమంచంమీద రత్తాలు నిద్దరోతోంది ఎర్రటి మందార పువ్వుల పరికిణీ, తెల్ల వాయిల్ వోణీ-చింతపూవుల జాకెట్టు యౌవ్వనం తొలి దశలోకి అడుగుపెట్టిన కూతురి వంక ఒక్క నిముషం అలా కుండానే 'మందు' సామాను వాసనను అసహ్యించుకునేది రత్తాలు చిన్నారి రత్తాలు గౌన్లు తొడిగే వయసులోనే తల్లిని పోగొట్టుకుంది

కనకం పోయాకనే తనలో మార్పు వచ్చింది రత్తాలు తనకు ప్రాణమై పోయింది అంతే-కనకం ఆశించినవన్నీ రత్తాలు అమలు జరిపింది.

'రత్తాలకీ యేడాదిలో పెళ్ళి చేయాలి' అనుకున్నాడు గంగన్న. ఈమధ్య ప్రొహిబిషన్ ఎత్తేశాక నిజంగా తన యాపారం బాగానే జరుగుతూంది

"దీపముండగానే యిల్లు చక్కబెట్టు కోవాలన్నట్లు నాలుగు రాళ్ళు వస్తున్నపుడే రత్తాలినో యింటిదాన్ని చేస్తే బరువు తీరుద్ది ఆలోకాన్నున్న కనకం సంతో షిస్తుంది.

నిజానికి రత్తాలికీ యాపారమంటేనే కిట్టదు. ఈ వృత్తి కంటే ఏ కూలో చేసు కుంటే నయం-అంటుంది. ఇంకా పిన్న తనం - పెపంచకం బాగా తెలీదు. ఈ గొప్పోళ్ళు. వూరూరా తిరిగి సందాలు పోగు సేసి, బీదోళ్ళ పేర్లు సెప్పి తమ పేణాల్ని సుఖపెట్టుకునే వారు, దేవుడి పేరెట్టి జనాన్ని నిలువునా మోసం చేసే వోళ్ళు. సీకటి బజార్లో సేతులు సాపి మేడలు కట్టే మొనగాళ్ళు, సత్తె పెమా ణాలు సేసి మొగం సాటు సేసే పెద్ద మడుసులు, కొల్లలుగా పిల్లలు లేని గోదారి ప్రవాహంలా లోకమంతా నిండి వున్నా రనీ, అందులో తను చేసే పనేం తప్పు కాదని, పాపం పదహారేళ్ళు నిండీ నిండని రత్తాలుకేం తెల్సు?"

సూరమ్మక్క కొడుకు రాజులుకి రత్నా ల్నిస్తే బావుంటుందని కొన్నాళ్ళుగా అను కుంటున్నాడు.

ఆడికీ ఓ సిన్న నౌకిరీ, వుండేందుకో గూడూ వున్నాయి మంచి వాకు లాంటోడు. ఆడి పేరెత్తితేనే రత్తాలు తెగ సిగ్గు పడుతుంది

తను మాత్రం తక్కువ సేత్తాడా! ఒక్కగా నొక్క బిడ్డ-తల్లి లేనిది తన సంపాదనంతా యింక అనుభవించే దెవరు? ఆళ్ళిద్దరూ సిలకా గోరింకల్లా కళ్ళముందు కళ-కళ్ళాడుతూంటే అన్నీ తీరిన యీ వయసులో యింకేం కావాలి తనకు?

గంగన్న ఆలోచనలు సగంలోనే ఆగి పోయాయి ఎవరో దబదబ తలుపు తట్టిన శబ్దమయింది

లేచి తలుపు తీశాడు తన యాపా రానికి యీ రకమైన అర్ధరాత్రి పిలుపులు అలవాటే!

"గంగన్నాయ్! పెద్ద బుడ్డీ ఓటి కావాల—మాంచి బేరమొచ్చింది" అంటూ తెచ్చిన నోట్లు చేతిలో పెట్టి, అక్కడే నించున్నాడు నాయుడు

నాయుడీ రకమైన సహాయాలు పెద్ద-పెద్దోళ్ళకు చేసిపెట్టడం, ఆళ్ళ గుట్లన్నీ తన గుప్పెట్లో పెట్టుకోవడం-చిన్నతనం నుంచీ అలవాటే! విశేషమేమిటంటే అందరిచేతా తాగించే నాయుడు మాత్రం ఎప్పుడోగాని తాగడు

అనుకోకుండా నాయుడి కళ్ళు రత్తాలు మీద పడ్డాయి ఆ చిన్ని వెలుగులో రత్తాలు అందాల జాబిల్లి ముక్కల్లా కన్పించింది నలభైయేళ్ళ నాయుడు చప్పున ముప్పై ఏళ్ళకు కుంగిపోయి కలలు గనే లోపునే గంగన్న బుడ్డీ చేతికందించాడు నాయుడి చూపుల అర్థాన్ని గ్రహించలేక పోలేదు గంగన్న

"గంగనోప్ఁయ్! రత్తాలు పెళ్లి కెదిగింది సుమా! నువ్వోరకున్నావో ఆనకెవడో ఎగరేసుకు పోగల్డు—సక్కదనాల సుక్క గదా మరి ."

నాయుడి పేలాపనకు ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది. అమాంతంగా వాణ్ణి బయటకు తోసి, తలుపు మూసి గడియ పెట్టాడు.

ఎదవ నాయాల-పున్నానికీ, అమాశకీ సుక్కేసుకుంటే యిలాటి పేలాపనలే

'హుఁ రత్తాలంటే యేటనుకున్నాడో! రతనం—మానిక్యం—దేవత పెట్టుకునే పారిజాతం ' అనుకుంటూ ఆనందంతో కూతురి వైపు ప్రేమగా చూశాడు.

ఊరంతా పూర్తిగా మాటు మణిగిపోయింది. నిశ్శబ్ద వాతావరణాన్ని లొంగదీస్తూ సముద్రం ఘోష పెడుతోంది వీధిలైట్లు అక్కడక్కడ మినుక్-మినుక్ మంటున్నాయి. ప్రజలంతా నిద్ర మైకంలో మందు నిషాలో మునిగిపోయారు

* * *

ఎర్ర చొక్కా వేసుకుని మోకాళ్ళ నీళ్ళలో ఆడుకుంటున్న పసివాడిలా దినకరుడు ఎర్రగా-అందంగా సముద్రపు ఆవలి అంచున కన్పించాడు. అటువంటి దృశ్యాన్ని రత్తాలు అదే పనిగా కన్నార్పకుండా చూస్తుంది తెల్లటి స్వచ్ఛమైన యిసుకను సముద్రుడు ముద్దాడుకుంటూ వెళ్ళిపోతున్నాడు. ప్రకృతంతా శాంతంగా మనోహరంగా వుంది

సముద్రపు ఒడ్డుపై యింకా అలా దృష్టి సారిస్తున్న రత్తాలి చూపులు ఆగిపోయాయి రోజూ చూసే చిన్న పడవలు, జాలరి వలలు అక్కడ లేవు, బేస్తలంతా దూరంగా గుమిగూడి వున్నారు, ఆ ప్రదేశమంతా పరిశుభ్రం చేస్తున్నారు,

అకస్మాత్తుగా రత్తాలి మనసులో సంతోష రేఖలు తొంగి చూశాయి

శ్రీరామనవమి యింకా తొమ్మిది రోజులుంది ఏటా శ్రీరామనవమికి ముందు తొమ్మిది రోజులూ వూరంతా వుత్సవాలు జరుగుతాయి ఏ రోడ్డు చూసినా—ఏ మూల చూసినా రామనామ జపమే రామనామ

---

''మీరెంతవరకు చదివారు?''

''అరవైఏళ్ళ ముందు ఆరవ తరగతి అయినా బి ఏ. చదివినవాడినైనా యింగ్లీషులో పడెయ్యగలను

—టి. యస్. మోహన్ బాబు, తిరుపతి




సంకీర్తనే భజనలే ..రాత్రులు హరి కథలు, బుర్ర కథలు, నాటకాలు, యథా విధిగా ప్రతి రోజూ జరిగి తీరాలి . వచ్చినవారందరికీ ప్రసాదాలు పంచి పెడ తారు. వాటికయ్యే ఖర్చంతా ఆ శ్రీరామ చంద్రుడిదే . . వేల కొలది రూపాయలు చందాల రూపంలో వసూలవుతాయి.

నవమి నాడు సముద్రపు ఒడ్డున 'లంకా దహనం' జరుగుతుంది.

లంక పేరుతో ఓ పెద్ద తడికల సౌధాన్ని నిర్మిస్తారు. దూరంగా అశోక వృక్షం!

నవమి నాటి—అర్ధ రాత్రివేళ హను మంతుడు వుగ్రరూపం దాల్చి సీతాదేవిని చెర నుండి విడిపించి-లంక తుద ముట్టించి సముద్రంలో తోక నిప్పు ఆర్పుకుం టాడు.

ఎక్కడలేని ప్రజలంతా ఆ తొమ్మిది రోజులూ వచ్చి చేరుతారు. ఆ సంబరాలూ వుత్సవాలూ చూసి తీరాల్సిందే!

రత్తాలికివన్నీ తల్చుకుంటే ఎంతో ఆనందమనిపించింది. లంక కట్టేందుకు పని కూడా మొదలయింది.

* * *

ఆ రోజే శ్రీరామనవమి....సముద్రపు ఒడ్డంతా యిసకేస్తే రాలనట్లుగా జనం పరుచుకున్నారు. ఎక్కడ చూసినా జన సమూహమే!

సాయంకాలమయ్యేసరికే వంటపనంతా పూర్తిచేసి తండ్రినడిగి సంబరాలు చూడ్డానికి మరికొంత మందిని తీసుకుని బయల్దేరింది రత్తాలు

చీకటి పడుతూన్నకొద్దీ మందు బేరాలు మరింత ఎక్కువయ్యాయి

ప్రతి నాల్గు రోడ్ల జంక్షను దగ్గరా పందిళ్లు వేసి స్టేజిలు కట్టారు స్టేజికెదురుగా దేముడు——ఎక్కడ చూసినా జనం లెక్కలేకుండా వున్నారు

ఒకచోట రికార్డింగు డ్యాన్సు జరుగుతోంది. నిండుగా పదహారేళ్లు దాటని ఆడపిల్లా, పాతికేళ్లు దాటని అబ్బాయీ సినీమా పాటలను అనుకరిస్తూ డ్యాన్సు చేస్తున్నారు

నైలాను ఓణీ, సగం ఒళ్లు కనిపించే జాకెట్టు పువ్వుల పొట్టి లంగాతో ఆ పిల్ల గెంతుతూంటే విచ్చల విడిగా అందరి మధ్యా అ పిల్లను అక్కున జేర్చుకుంటూ రీవిగా డాన్సనే పేరుతో ఒళ్లు విరుచుకుంటున్నాడా అబ్బాయి

దేముడి కెదురుగా యిటువంటి పనులు చేయటం యీ రోజుల్లో తప్పుగా పరిగణించబడదు పైగా బైరో భజనలూ, రామనామ సంకీర్తనలూ జరపటం చిన్నతనంగానూ, తక్కువగానూ భావిస్తున్నారు.

ఎగిరి గంతులేసే ఆ పిల్లను చూసి, జనం విరగబడి ఈలలేసి తప్పట్లు కొట్టి, నానా భంగిమల్లో ఆమెను చిత్రించుకుని ఆనందిస్తున్నారు.

రోడ్ల మీదకూడా మగాళ్ళు ఆడవేషం వేసుకుని షో డాన్సులు చేస్తున్నారు ఎక్కడ చూసినా పులివేషాలు——

ఒకటి-రెండు చోట్ల తప్పితే అన్ని చోట్లా రికార్డింగు డా న్సు లే జరుగుతున్నాయి

రత్తాలికి అవి చూడ్డం అట్టే మనస్కరించలేదు అవి చూస్తూన్న జనం ఉద్రేకంతో ఆకవార్ని చూసి మీద పడుతున్నారు

ఇంటికొచ్చి తనింత అన్నం తిని అయ్యకింత పెట్టి మంచం మీద నడుం వాల్చిందో లేదో నాయుళ్ళ పిల్ల సుబ్బులు ఓ పది మందిని తీసుకు వచ్చింది లంకా దహనం చూసే ఏర్పాటుతో

రత్తాలు మళ్ళీ వుత్సాహాన్ని పుంజుకుంది. ఓ మూల భయం ఆవరించినా కూతురి యిష్టాన్ని కాదనలేక పోయాడు గంగన్న.

అర్ధ రాత్రి గడిచేసరికి వూళ్లో అన్ని సంబరాలూ ముగిసిపోయాయి. జనమంతా సముద్ర తీరానికి చేరుకున్నారు. లంక దేదీప్యమానంగా వెలిగి పోతూంది కొద్ది దూరంలో అశోక వృక్షం క్రింద సీత దిగాలు పడివుంది. ఆంజనేయులు అంగుళి

చూపించి తనను తాను రామదూతగా పరి చయం చేసుకున్నాడు అ తర్వాత లంకను తుదముట్టించడమే ధ్యేయమన్నట్లు తోకకు నిప్పంటించుకుని చెట్టుకు, కోటకు కట్టిన వైర్ ద్వారా గాలిలో ఎగిరాడు.

అప్పుడే కిటకిట లాడుతూన్న జనం మధ్య తోపుడు ప్రారంభమైంది స్త్రీలకై ప్రత్యేకింపబడిన స్థలం యొక్క అడ్డ కర్రలు కిరకిర లాడి విరిగి పోయాయి మహాసముద్రంలా జనం ఎటుబడితే అటు విరుచుకు పడుతున్నారు ఆధారం లేక గాలివాటుగా ఎటో పోతున్నారు

నలుగురి మధ్యా నిల్చుని ఆనందంగా దృశ్యాన్నంతా చూస్తున్న రత్తాలు అను కోని తోపుకు తుళ్ళి ప్రక్కకు ఒరిగి పోయింది

ఆంజనేయుడు లంకను తుద ముట్టిం చాడు మంటలు రేగాయి. జనంలో కల కలం మరింత హెచ్చింది

అవకాశంకోసం వేచియున్న కొందరు పురుషులు స్త్రీలపై బడ్డారు! ఎవరూ ఎది రించలేని పరిస్థితి అందరిలోనూ ఏర్ప డింది. అబలలకూ-బలవంతులకూ మధ్య పెనుగులాట—నీతికీ, అవినీతికీ మధ్య సంఘర్షణ! మానవత్వం మా నా న్ని కోల్పోయే దుస్సంఘటన—

అంతే! దేముడిపేరు చెప్పుకుని మడి గట్టుకున్నామని చెప్పే నీతిపరులందరూ నిగ్రహాలను సడలించుకుని తమలో పేరు కుని పడగలెత్తే కోరికతో పరుగులెత్తారు.

అందిన స్త్రీని అనుభవించారు!!

జన సమూహంలో మరింత కలవరం బయలుదేరింది ఒకవైపు పోలీసులు లాఠీ లతో విజృంభించారు

అసహజపు లంక కాలి బూడిదగా మారుతోంది—అవినీతి పరులలో మండి ఆరిన కోరికల్లా

జనమంతా పాయలు-పాయలుగా విడి పోయి యిళ్ళ దారి పట్టారు ఎవరి సంతోషం వారిది! ఎవరి తృప్తి వారిది! ఎవరి బాధ వారిది! ఎవరి భయం వారిది!!

కొద్ది సేపటిలోనే ఆ ప్రదేశమంతా ఇంచుమించు ఖాళీ అయిపోయింది.

కానీ—

ఒక ఇసిక తిన్నెమీద నలిగిన చీరతో నిర్జీవంగా ఆకాశం వంక చూస్తోంది ఒకామె ఆమె వేసుకున్న బాడీ అక్క-

---

సబ్ యిన్స్పెక్టర్ దొంగతో ఇప్పటికి ఎన్ని దొంగతనాలు చేశావ్?

దొంగ ఒకటి సూపరిండెంట్ గారింట్లో, రెండవది సర్కిల్ యిన్స్పెక్టర్ గారింట్లో, మూడవది మీ యింట్లో, నాల్గవది జవానుబాబుగారింట్లో!

—టి. యస్. మోహన్ బాబు, తిరుపతి

దక్కడ చిరిగి రక్తం చిమ్ముతూన్న కొన్ని భాగాలు కన్పిస్తున్నాయి ఆమె ముఖం మీద-మెడ మీద కూడా రక్కులు బలంగా వున్నాయి.

ఆమె కళ్ళలో జీవం లేదు—

ఆమెలో చైతన్యం లేదు—

ఆమెను కాపాడగలిగిన వారూ లేరు—

ఆమె రత్తాలు!!

ఆమె చుట్టూ పోలీసులు మూగి వున్నా జీవం లేని ఆమె కళేబరాన్ని కాపాడేందుకు—ఎవరికి తోచిన పని వారు త్వర-త్వరగా చేసుకు పోతున్నారు ఆమె నీ స్థితికి తెచ్చిన మహనీయులందరికీ శిక్షలు పడేవరకూ తాము నిదుర పోమన్నారు కొందరు.

కాని వారి సానుభూతికీ, ఉపకారానికీ అతీతురాలైన రత్తాలు నిశ్చలంగా పడి వుంది-నింగీ నేలకు మధ్య.

విషయం తెల్సిన గంగన్న పరుగెత్తు కొచ్చాడు. రత్తాలినలా చూసేనరికి నిలు వునా కూలిపోయాడు

'రత్తాలూ!' అంటూ అతను వేసిన గావుకేక సముద్రపు హోరులో కలిసి పోయింది.

రత్తాలు దేముడి సమక్షంలో అన్యా యానికి ఆహుతై పోయింది. పెళ్ళి కాని రత్తాలులోని కోర్కె సుకుమారానికి నోచు లేక పోయింది. ప్రాణం కోసం కాక మానం కోసం పోరాడి, ఓడి ఆహుతై పోయింది రత్తాలు.

కొన్ని గంటల క్రితం పవిత్రమయిన ఆ స్థలం అపవిత్రమై విషాదంగా మారి పోయింది.

కళ్ళారా చూసిన ఘోరానికి దేము డంతటి సముద్రుడుకూడా సాక్షిగా నిలువ లేక బావురుమన్నాడు

అంత దుఃఖంలోనూ గంగన్నలో కోపం అవధులు దాటింది. తన కన్న కూతుర్ని అన్యాయం చేసిన దుర్మార్గుల అంతం చూద్దామనుకున్నాడు ఉన్నపాటున వారిని పట్టి పొడిచి రక్తపు మడుగుల్లో వాళ్ళు తేలుతూ వుంటే చూసి ఆనందించా లనుకున్నాడు.

'కాని—ఈ అన్యాయం జరగటానికి కారణం వాళ్ళు కాదు-నేను న్యాయాన నేనే ' అనుకున్నాడు గంగన్న తన లోనే-పెద్దగా!

రక్తవర్ణమయిన అతని కళ్ళ ముందు గతమంతా భయంకరంగా పురి విప్పింది.

పాతిక సంవత్సరాల క్రిందట

ఇదే పండుగ-ఇదే రోజు

లంకాదహనం సంబరంలోనే—

గంగన్నలోని కోరిక కొండంతైంది. అతని కళ్ళలో వాంఛ తీవ్రరూపం దాల్చింది.

అంతే! అతని మనసు మంచీ చెడుల విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయింది

దూరంగా చీకట్లో కన్పించిన స్త్రీమీదకు పురుషత్వం విరుచుకు పడింది-సింహంలా ఘర్జించాడు తన బాహుబలాన్ని ఉపయోగించి వశపరుచుకున్నాడు తనివి తీర్చుకున్నాడు

కానీ ఆమె-తనను వదల్లేదు! ఆమె బిగిసిన పిడికిట్లో తన వస్త్రం యిరుక్కుంది తను విడిపించుకోటానికి విశ్వ ప్రయత్నం చేశాడు కానీ ఆమె-తన పట్టు వదల్లేదు—దూరంగా జనం!

ఆమె కేక వారికందింది ఇద్దరిమధ్యా పెనుగులాట—అర్ధ నగ్నపు శరీరాలతో, అక్కడక్కడ చిమ్మిన నెత్తురు మరకలతో

దూరంగా పోలీసుల గుంపు - శాంతి రక్షణకోసం నలువైపులా ఆక్రమించుకుంటున్నారు-చెవులు చిల్లులుపడే యీలల ఘోష!!

అంతే! గంగన్న తన శక్తినంతా కూడా దీసుకుని ఒక్కతోపు తోశాడు—

ఆమె దూరంగా కెరటాలదగ్గరగా పడిపోయింది- పడిన మనిషి మరి లేవలేదు- దగ్గర కెళ్ళి చూశాడు-ఆమెలో చైతన్యం లేదు-తను చేసిన పనికి ఉరిశిక్ష పడొచ్చు అని భయపడ్డాడు- పోలీసులు పసిగట్టేస్తే -ఇంకేముంది?

అతని శరీరంలో ప్రతి అణువూ వణికింది- వళ్ళంతా చెమటతో ముద్దయింది-

అతని ఆలోచనలు పరిపరి విధాల పోయాయి-

అంతే! అత నేం చేయాలనుకున్నాడో యేం చేశాడో అంతా అరక్షణంలో జరిగిపోయింది.

ఎవరికంటా పడకుండానే ఆమెను సముద్రుడి కర్పించి భారంగా అడుగు లేస్తూ గుంపులో కలిసిపోయాడు- తెల్లవారకముందే వూరి పొలిమేరలు కూడ దాటిపోయాడు-

మళ్ళీ ఆరేళ్ళ తర్వాతనే కనకంతో సహా అడుగుపెట్టాడు ఎవరూ అనుమానించకపోయినా తను చేసిన తప్పుకు మనసులోనే పశ్చాత్తాపపడ్డాడు- కనకం తన బాధనూ, పేదరికాన్నీ కూడ దూరం చేసింది - సంసారాన్ని ఓ స్థితికి తీసుకొచ్చింది.

* * *

గతంలోంచి చూపులు మళ్ళించి చూసేసరికి గంగన్న చుట్టూ కొద్దిపాటి జనం కూడారు - సముద్రఘోష తప్పితే అంతా నిశబ్దంగా వుంది-

దూరంనుండి చిన్న వెలుగు రత్తాలి ముఖంమీద లీలగా పడుతోంది!

ఆ నాడు తను చేసిన పాపానికి




ప్రాయశ్చిత్తం ఆ దేముడే విధించాడు- తనకళ్ళముందే కన్న కూతురు అన్యాయానికి ఎర అయిపోయింది!

అతని కళ్ళలో ఆ నాటి "ఆమె" ఆవేదన, కంగారూ స్పష్టంగా కన్పించాయి- భరించలేక దిగ్గున లేచాడు- చుట్టూ అంతా తలలొంచుకుని నిలబడివున్నారు-

అంతే! ఎవరూ వూహించని విధంగా గబగబా అడుగులేసి సముద్ర మధ్యలోకి నడిచాడు- క్షణంలో సముద్ర గర్భంలో గంగన్న యిమిడిపోయాడు - కెరటాలు నురుగులు కక్కుతూ ఎగిరిపడ్డాయి!

తెల్లవారింది—

పాపాలు చేస్తూ సంఘంలో పెద్ద మనుషులుగా చెలామణీ అవుతున్నవారికీ, స్త్రీలోలురకు, వ్యభిచారులకూ, అవినీతిపరులకూ, పోలీసులకూ, భక్తులకూ, సామాన్యులకూ అందరికీ తెల్లవారింది-

విషయం తెల్సిన కొద్దిమంది 'పాపం' అంటూ సానుభూతి చూపారు.

కానీ రత్తాలిని వ్యభిచారిణిగనూ, గంగన్నను పిచ్చివాడిగనూ జమకట్టింది సంఘం *

(పురుషుడు చేసిన అన్యాయాలకు
ఆహుతులైపోయిన స్త్రీమూర్తులకూ—
అన్యాయాలు చేసినా మనసారా
పశ్చాత్తాపం పడ్డ పురుషులకూ—
యీ కథ అంకితం

రచయిత)

# పదబంధ ప్రహేళిక

**శ్రీ-శ్రీ**

| 1 ప | రు | 2 గు | లు | ■ | 3 | 4 | | 5 డు |
|---|---|---|---|---|---|---|---|---|
| డి | ■ | | ■ | 6 | ■ | | ■ | ము |
| శె | | ■ | 8 | | | ■ | 9 పా | వు |
| డు | ■ | 10 | ■ | | ■ | 11 | ■ | లు |
| ■ | 12 | | | | | | | ■ |
| 13 | ■ | | ■ | | ■ | | ■ | 14 |
| 15 | | ■ | 16 | | | ■ | 17 | |
| | ■ | 18 | ■ | | ■ | 19 | ■ | |
| 20 | | | | ■ | 21 | | | |

## అడ్డు

1. క్రికెట్‌లో కాలికి బుద్ధి చెప్పడాలు కావోలు!
3. లక్ష్మీపతి కవిసార్వభౌముడు.
7. 32లో కామి లేదు. భూమి తిరగబడింది.
8. కొమ్ము ల్లేని కులుకు కోపాని క్కారణం?
9. చదరంగంలో నాలుగో వంతు.
12. గౌతమబుద్ధుని మహాప్రస్థానం.
15. క్షయకి సూచన
16. సంపద విశాఖ పట్టణంలో దొరకొచ్చు
17. తిరగబడే గగనంలో పక్షి!
20. రమణాస్థాన్ మహర్షి ఇంటి పేరు
21. (మిలనేకా) మారువేషంలో ఒక రాక్షసుడు.

## నిలువు

1. 71 తిరగెయ్యాలి
2. 20 తల దేవుడి యిల్లు.
4. బొడ్డులో విషం?
5. ప్రథమా విభక్తి.
6. మన కవితా పితామహుణ్ణి వికటకవి ఇలా పిలిచాడు
10. ఇదో ఎడారి
11. అంతా మరణించడంలో ఉంది. నీళ్ళలో ఉంటుంది.
13. ప్రజా నాట్యమండలి వారి నాటకం. (మొదట ప్రశ్నించు!)
14. ఏమిటి? గమనంలో తిరిగి చూడు! మగతనానికి
18. స్థూలకాయుణ్ణి దీనితో పోలుస్తాం.
19. సగం ఇవతల సగం అవతల!

ప్రతి నెల 20వ తేదీ లోగా పూరించిన పజిలు మాకు చేరవలయును.
ఆల్ కరెక్టు వాళ్ళకు ఒక 'జ్యోతి' ని బహుమతిగా ఇవ్వగలం.

# జూన్ నెల పజిల్ క్లూ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| వ | గ | రు | ■ | కాం | ర | గా | ర | మి |
| చ | ■ | చి | ■ | రా | ■ | ధి | ■ | స |
| న | త్రి | ■ | జ | ల | ఖు | ■ | ఖ | వి |
| క | ■ | ఈ | డ | ■ | స | రే | ■ | ■ |
| వి | జ | య | ■ | స్త్రీ | ■ | రా | ఋ | వ |
| ■ | ■ | నా | చౌ | ■ | ప్రాం | ణి | ■ | సం |
| క | వ | ■ | ప | న | స | ■ | నే | త |
| ల | ■ | బా | ■ | గ | ■ | మాం | ■ | సే |
| రా | మ | బా | ణ | ము | ■ | య | ము | న |

## ఆల్ కరెక్టు

(1) తూబాటి నాగభూషణరావు, చిలకలూరిపేట. (2) భట్టారా ఉదయుడి, నంద్యాల. (3) శ్రీమతి కె. లక్ష్మీరావు, మద్రాసు-16 (4) శంఖవరంపాణిని, బెంగుళూరు-13. (5) యన్ వెంకటేశ్వర్లు, కొత్తపట్నం. (6) పి శివకుమార్, బొంబాయి.

## ఒక తప్పు

(1) పి. భానుమతి, నర్సాపురం (ప. గో). (2) టి. పద్మిని, వాత్తేరు. (3) పి. ఇందిరాశైలం, నిజామాబాద్. (4) యన్. ఆర్. చంద్రశేఖరం గుంటకల్లు (5) యస్ రామమోహన్, హైదరాబాద్-42



# మీ ప్రశ్నలకు

# శ్రీమతి సూర్యకాంతం

## జవాబులు

ప్ర: సూర్యకాంతం గార్కి, మీరు సినిమాలలో ఎంత గయ్యాళిగా ఉన్నా ఇంటివద్ద చాలా సౌమ్యంగా ఉంటారని విన్నాను. ఒక్కసారి మీవద్దకు రావలెనని. యీ అభిమానుడు జ్ఞాపకముంటాడా?

యస్. మురళీ రామకృష్ణారావు,
ఒంగోలు.

జ: తప్పక గుర్తుంటారు, అభిమానులే!

ప్ర: అత్తగారూ! నాకు యీడొచ్చిన అమ్మాయి మీదగ్గర వుంటే నాకిచ్చి పెళ్ళి చేస్తారా?

బక్క నానిబాబు, విశాఖపట్టణం.

జ: నీకీడు ఎంత వచ్చిందో నాకు తెలియదుగా నానిబాబూ! అయినా నీవు బక్క, బాల్లే! పిల్లకి పుస్తెకట్టడానికి పీటల మీద కూర్చునే ఓపికైనా ఉందో లేదో! బాబ్బాబు నాపిల్ల తాడు గట్టిది.

ప్ర: ఏమండోయ్! (సూరే) కాంతం గారూ! కోడళ్ళందరూ కక్షగట్టి ఒక్కసారిగా మీపై యుద్ధానికి వస్తే మీరేం చేస్తారు?

—గోవిందయ్య, కావలి.

జ: రా(రా)రు. వాళ్ళు కూడా రేపు అత్తలౌతారుగా! అందుకని వాళ్లు యుద్ధానికొచ్చినా, కాస్త నాకాళ్లు జాపితే ఆముదం రాసి నాకాళ్లు మర్దనచేసి కళ్ళు కద్దుకుని మరీ వెడతారులే గోవిందయ్యా నీకా భయంవద్దు.

ప్ర: అయ్యో! అయ్యో! ఏమిటి ప్రతి చిన్న విషయానికి అంత నోరు చించుకొని గొడవచేస్తావు. నీది నోరా, నడి వీధి రోలా. ఏదో నీ భర్త అన్నలాంటి

వాణ్ణి గనుక చెబుతున్నాను. ఇకనైనా నీ గొడవ బంద్ చేయి.

ఎమ్. శంకరరెడ్డి, బెల్లంపల్లి.

జ: నా భర్త అన్నగారిలాంటి.— అంటున్నారు పెద్దబావగారా! అయితే యింకేం. ఫరవాలేదు. పెద్ద బావగారు అడంగులతో సమానం. పెద్ద జరీ అంచు కోక పంపిస్తా పండక్కి మీకు.

ప్ర: ఆడవాళ్ళకు నటన అనేది పుట్టుకతోనే వస్తుందంటారు నిజమేనా?

ఎ. వి. కె. మోహనరావు, సత్తెనపల్లి.

జ: ఆడ, మగా తేడాలు లేవు నటనకు. మీ మగరాయళ్ళకు కూడ నటనొచ్చునులే! అట్టే చెప్పకు చాలు.

ప్ర: సూర్యాకాంతంగారూ! దయచేసి తమ భర్తగారి పేరు చెబుతారా?

ఐ. సత్యనారాయణ, ఖమ్మం.

జ: అయ్యో! అయ్యో! భర్త పేరు చెప్పొచ్చా.

ప్ర: ఆడపిల్ల అత్తవారింటికి పోయేటప్పుడు ఏడుస్తుంది. కాని మగ పిల్లవాడు అత్తవారింటికి పోయేటప్పుడు ఎందుకు ఏడ్వడు? మరియు నేను పెద్ద రచయితను కాదలచుకొన్నాను.ఏమి చెయ్యాలి?

ఎస్. హెచ్. జమీరు అహ్మద్,
కరీమ్‌నగరు.

జ: మగ పిల్లవాడు అత్తగారింటికి వెళ్ళడు. ఒకవేళ వెడితే మామగారి ఇంట్లో కూర్చొని తేరగా కడుపునిండా మెక్కి ఇంటి వాసాలు లెక్కపెడ్తాడు. ఇల్లరికం అల్లుడు కదూ! పోతే రచయిత అవాలంటే పెద్ద మసిబొగ్గు తీసికొని కన

---

ఓ తెలుగుసినిమా విడుదలయింది. ఘోరపరాజయం పొందే సూచనలు కనిపెట్టిన ఆ చిత్ర నిర్మాత వెంటనే ఓ పత్రికా ప్రకటన గావించాడు.

"మా చిత్రం ఘోరపరాజయం పొందిన విషయాన్ని కాదనము. కాని చలన చిత్రరంగంలో ఇది ఓ అపూర్వ ఘోరపరాజయం. ఈ పరాజయానికి సరైన కారణాలు తెల్పినవారిని తగురీతిగా సత్కరిస్తాం. ప్రేక్షకలోకం మాతో సహకరిస్తుందని ఆశిస్తున్నాం."

ఆ చిత్రం తర్వాత చాలా సార్లు శతదినోత్సవాలు జరుపుకొన్నది.

—డి. ఉదయభాస్కర్, మద్రాస్

పడిన గోడ వదలకుండా బరికేసెయ్. వేసూ అంతేలేః

ప్ర॰ ఆంధ్రప్రదేశ్ అత్తగారయిన సూర్యకాంతమ్మగార్కి, మీ అల్లుడు వ్రాయునది. మీ తదనంతరం ఆస్తి నాకు చెందునట్లు వీలునామా వ్రాసిపోండి.

ఎమ్. శ్యామరావు, బెల్లంపల్లి.

జ ఎవరు ముందో ఎలా చెప్పగలవు ఒకవేళ నా కూతురు తాడు తెగి నువ్వే ముందు గుటుక్కుమంటే.

ప్ర అత్తయ్యత్తయ్యగారూ! మీ పేరు మీదుగా "చుప్పనాతి సూరే కాంతం శత పద్యావళి" అనే పత్రిక ప్రవేశంవల్ల జనాదరణకు సూచన లుంటాయంటారా?

యస్. వి. రాఘవేంద్రరావు, చెల్లూరు.

జ అంత సాహసం చేయడం చెల్లదు ఏదైనా దేవుని పేరమీద వ్రాస్తే ముక్తి మోక్షం వస్తాయిగాని యిదేమీ మంచిది గాదు

ప్ర. కోడళ్ళకు నాయకులారా! సినిమా కోడళ్ళు నీ నామమును స్మరించితే హడలెత్తిపోతారు. మరి మీ చిత్రాల్ని చూసే కోడళ్ళు మిమ్మల్ని దుమ్మెత్తి పోస్తారెందుకండీ!

పి. సుబ్రహ్మణ్యం, తిరుపతి.

జః యిలా పిలు. చెప్తా. హోయే. హోయె కోడళ్ళు ఎంతధైర్యం ఏరీ ఎక్కడ వాళ్ళు.

ప్ర॰ ప్రపంచ సూలకాయుల మహా సభ నొకదానిని ఏర్పాటు చేద్దామని నా సూలకాయ మిత్రులనుకొంటున్నారు. అందులో ప్రముఖులయిన మిమ్మల్ని అధ్యక్షురాలుగా ఆహ్వానిద్దామనుకొంటున్నారు. మీరంగీకరిస్తారా? (నేను సన్నవాడినే సుమండీ!)

జి. ప్రభాకరరావు, సికింద్రాబాదు.

జ ఆ వచ్చినాళ్ళు నీకు స్నేహితులేమిట్రా పిచ్చికుంకా! వద్దు వాళ్ళ స్నేహం చెయ్యకు. అసలే బక్క వచ్చినాడివి నలిగి చస్తావు. వద్దొద్దు

ప్ర పిన్నిగారితో సమానురాలయిన శ్రీమతి సూర్యకాంతంగారూ! నాకు సినిమాలలో నటించాలని ఉన్నది. అందుకు ఏ ఏ అర్హతలు కావాలి?

సి. క. రాజేంద్రప్రసాదు,

అనంతపూరు.

జ॰ నటనకు డిగ్రీలవసరం అట్టే ఉండదు. పాత్రను అర్థం చేసుకొనే వరకు విజ్ఞానం ఉంటేచాలు. సానపట్టే కొలదీ వజ్రం ప్రకాశించునట్లు నటన దిన దిన ప్రవర్ధమానమౌతుంది. డిగ్రీలుంటే ఇంకా మంచిది బాబు. ఏ వయసుకి తగ్గ పాత్ర ఆ వయసుకు ఉంటుంది.

# మాడరన్ లివింగ్

— పోడూరి దత్తాత్రేయ

## ఏవరు గొప్ప?

వివాహమైన రెండు సంవత్సరముల తరువాత ప్రాణ మిత్రులు శంకరం, సూర్యంలు బస్ స్టాండ్ దగ్గర తారస పడ్డారు ఇద్దరికీ ప్రాణాలు లేచి వచ్చాయి. మొహాలలో లేని ఆనంద రేఖలను గూర్చి వెదుక సాగారు. శంకరం కదిపాడు.

"ఒరే సూర్యం! ఈ గడచిన రెండు సంవత్సరాల దాంపత్య జీవితములో నీవు నేర్చినదేమిటి?"

"నా సంగతి కేమిటిలే గాని, ముందు నీ సంగతి చెప్పరా?" సూర్యం ఎదురు ప్రశ్న.

"చెప్పాలంటే చాలానే వుంది. కాని, టూకీగా చెప్పాలంటే, పిండి వంటలన్నీ దాంపత్య జీవితములోనే నేర్చుకున్నాను. ఇంటి పనులన్నియు కూడా దాంపత్య జీవితములోనే నేర్చుకున్నాను. ఇవే కాక క్లబ్బులో పేకాటలో జరిగే మోసాలు, కుతంత్రాలు, మా ఆవిడ స్వయముగా చూడడమే గాక, అనుభవించినవి కూడా చెప్పగా నేర్చుకొన్నాను. మరి నీ సంగతేమిటిరా?" శంకరం ఆపాడు. సూర్యం ప్రారంభించాడు.

"వివాహమయి, మా శ్రీమతి కాపరానికి వచ్చిన తరువాతే నేను కూడా వంటా వార్పూ నేర్చాను. పిండి వంటలు కూడా చేయగలను. ఇంటి పనులే కాక పిల్లల్ని సాకడం విషయంలో కూడా మా శ్రీమతి వాళ్ళ అక్కగారి పిల్లల్ని తీసుకు వచ్చి ప్రత్యేక శిక్షణ యిచ్చింది. ఇక పోతే పేకాటలోని కుతంత్రాలు పరోక్షముగా నేర్చుకునే ఖర్మ నాకేమిటి?.... ప్రత్యక్షంగానే, మా యింటి చుట్టుపక్కల వాళ్ళతో, మా ఆవిడ ఆడుతూండగా నేనే చూసాను వీడ్కోలు యిచ్చే విధానములో క్రొత్త పద్ధతి నేర్చుకోవటం కోసమే, మా ఆవిడని బస్సు ఎక్కించాను! ఇప్పుడు చెప్పు, ఎవరు గొప్ప?" అని సూర్యం ఆపిన వెంటనే, శంకరం కరచాలనము చేసాడు.

## ఖర్చుతో కూడిన పని

తొంభై తొమ్మిది సంవత్సరాలు పూర్తి చేసుకుని, జీవితములో విశేషమైన అనుభవాన్ని గడించిన వృద్ధుడిని, సిగరెట్ నోట్లో పెట్టుకుని, విలాసముగా నవ్వుతున్న యువకుడు కదిపాడు.

"ఏమిటండీ? విశేషముగా ఆలోచిస్తున్నట్టున్నది? నేను కూడా నేర్చుకోదగినదైతే సెలవియ్యండి."

చాల పదిలముగా, తనకు తెలిసిన పరమ రహస్యాన్ని వృద్ధుడు తెలియ చేశాడు.

"నాయనా! రోజులు మహా దారుణముగా తయారయినాయి. ప్రతీ దానికీ కూడా విపరీతమైన ఖర్చు. మనిషి జీవించటానికి ఖర్చు, సంసారాన్ని నడపటానికి ఖర్చు, అతిధులను ఆదరించటానికి ఖర్చు—యిన్ని ఎందులకు? చివరికి చావటానికి కూడా విపరీతమైన ఖర్చు.... బ్రతికినన్నాళ్ళు, పైసా పొల్లు పోకుండా, జాగ్రత్తగా గడిపాను. అయితే నేను కనుక చస్తే, బోలెడంత ఖర్చు కదా? అందుచేత 'ఖర్చు లేని చావు' చావటం గురించి ఆలోచిస్తున్నాను."

మారు మాటాడక, చల్లగా జారుకున్నాడు బుద్ధిమంతుడు.

రిటైర్డ్ సెషన్స్ జడ్జి శ్రీ బండి సీతారామమోహన్‌రావు పరిశీలించిన కేసు

# వాస్తవ గాథలు - 2

కథారూపం: వ్యాస్‌చంద్

వంటిల్లంతా పొగతో దట్టంగా ని. డిపోయి ఉంది

లక్ష్మమ్మ ఆ పొగలో కలిసి పోయింది. పొయ్యి తిరిగి మండేందుకు శతవిధాల ప్రయత్నిస్తూంది. కళ్ళు తెరిస్తే మండిపోతున్నాయి. నీరు ధారగా కారిపోతూంది.... పొగలోంచి బయట పడేందుకు లేచే శక్తి కూడా దూరమయింది. ఆయాసంతోపాటు దగ్గు తెరలు ప్రారంభమయ్యాయి. ఖంగు-ఖంగుమన్న శబ్దంతో ఎడ తెరిపి లేకుండా దగ్గుతూనే పొయ్యి తిరిగి మండించేందుకు శతవిధాల ప్రయత్నిస్తుంది. ఇంకాసేపట్లో శుభ్రంగా వుడికి, దించివేయ వలసిన అన్నం కాస్త యెందుకూ పనికి రాకుండా పోయేట్లుంది. అయినా ఆమె ప్రయత్నం ఫలించటం లేదు. దగ్గు తెర పూర్తిగా ఆవరించింది. పొగలో నేలమీద చతికిలబడింది.

దట్టమైన పొగ!

ప్రాణాలు పిండేసే దగ్గు తెర!!

ఉడికీ ఉడకకుండా పాడై పోతున్న పొయ్యిమీద 'అన్నం'!!!

—లక్ష్మమ్మ అశాంతి జీవితానికి ప్రతిబింబాల్లా ఆమె మనసులోనే మెదలుతున్నాయి.

ఆమెవూహాలకు, ప్రయత్నానికి అంతరాయం కలిగిస్తూ, ఎవరో బలవంతంగా బయటకు నడిపించినట్లయింది. అడ్డుచెప్పే స్థితిలోకూడా లేదు తను. ఇంకాసేపుంటే మైకం వచ్చివుండేది. అప్పటికీ గాలిలో తేలుతూన్నట్లుగా వుంది.

వంటగది బయట ఎప్పుడూ వేసి వుంచేమంచంమీద పడుకోబెటినట్లయింది. అప్పటికీ దగ్గుతెర వదల్లేదు. ఖంగు ఖంగుమంటూ గుండెలు పిండేస్తున్నది.

"మంచినీళ్లు తాగు" కొంచెం తల పైకెత్తుతూ తన భర్త రామయ్య స్వరం వినిపించింది.

అంతవరకు పొగతో ఉక్కిరి బిక్కిరైన లక్ష్మమ్మ నుదుటికి చల్లనిగాలి తాకింది దానికితోడు భర్తస్వరం ఆమెకు మరింత హాయి నిచ్చింది. మెల్లగా కళ్లు తెరిచి చూచింది, తనకు మంచినీరు అందిస్తూ ప్రక్కనేఉన్న భర్త రామయ్య లీలగా కనుపించాడు. కారణం కళ్ళలోని నీరు యింకా యింకిపోలేదు. మరింత కలిపి ఎండిపోయిన ఆమె చెంపలమీదుగా కారాయి, ఎక్కువ కన్నీరు వచ్చినందుకు కారణమూ లేకపోలేదు. ఎవ్వరూ దగ్గర లేకుండా తనకు ఏదో ఓ నాడు దిక్కుమాలిన చావు సంప్రాప్త మవుతుందని ఆమె భయం! ఆవేదన!! అశాంతి!!! అందుకే పొగవలన ఏర్పడిన కన్నీటితో బాటు ఆవేదన, అశాంతి, భయంవలన




ఏర్పడిన కన్నీరుకూడా మిళితమైంది. కానీ, ఆ విషయం రామయ్యకు చెప్ప లేదు. చెప్పి అతనిమనసు బాధపెట్టలేదు. అందుకే శక్తి లేకపోయినా పమిటతో

ళ్లు తుడుచుకుంటూ, దగ్గును బలవం తంగా ఆపుకుంటూ లేచికూర్చుంది. భర్త అందించిన నీళ్లు త్రాగి, ఆయాసాన్ని మెల్లిగా దూరం చేసుకుంది. తన కేబాధా లేనట్లు రామయ్యను చూసి, లేని నవ్వు తెచ్చుకుంటూ, తృప్తిగా చూసింది

"నీ కెందుకే యింత బాధ? వంట మనిషిని పెట్టుకోకూడదూ? నీ కేంతక్కు వని?" రామయ్య అదో మాదిరిగా చూస్తూ అన్నాడు!

"ఏం నేను చేసుకోలేనా?" లక్ష్మమ్మ సమాధానం నవ్వుతూనే యిచ్చింది.

"ఇంకా నువ్వు చిన్న పిల్లవా ఏంటి? ఓపికుండొద్దూ?"

తనకు ఓపిక లేదని లక్ష్మమ్మకు తెలుసు, దాదాపు నలభై సంవత్స రాలు దాటబోతున్నాయి. తన జీవితంలో తన భర్తను ఎంతోకాలం సుఖపెట్టలేదు. అందుకని రామయ్య పిలాసాలకు తను అడ్డు రానూలేదు,

"నేను అప్పుడే ముసలిదాన్నయ్యా నేంటి!" చిరునవ్వుతో అంది,

"కాదులే! ఈ యింట్లో మనిద్దరం తిరుగుతూంటే చిన్న పిల్లల్లానే వుంటాము." అంటూనే ముందు వరం డాలోకి వెళ్లిపోయాడు రామయ్య.

లక్ష్మమ్మ హృదయాన్ని అమాంతం గతం కెలకింది. తన బాబు బ్రతికి వుంటే!! ఎప్పటికైనా కోడలు రాకపో తుందా అనే నమ్మకం వుండేది. కానీ, ఆశలన్నీ అడియాసలు చేస్తూ తన బాబు దూరమయ్యాడు. ఇక ఈ జన్మకు తనకు పిల్లలు పుట్తారనే నమ్మకం పూర్తిగా నశించిపోయింది.

ఆమె ఆలోచనలకు అంతరాయం కలుగజేస్తూ, రామయ్య తిరిగివచ్చాడు. ఈ సారి అతను దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లుగా గ్రహించింది లక్ష్మమ్మ.

ఆమె ప్రక్కన వచ్చి కూర్చున్నాడు.

అతని దీర్ఘాలోచనకు కారణమేమిటో అర్థం చేసుకోలేక పోతూంది లక్ష్మమ్మ. అయితే ఆ ఆలోచనంతా తనను గురించి అని మాత్రం ఆమెకు స్పష్టంగా తెలుసు,

"ఏమే...." అనాలోచితంగా పిలి చాడు.

"ఊఁ ..." అంది లక్ష్మమ్మ.

"ఎటూ నువ్వొక్క దానివి యింత బండచాకిరీ చేసుకోలేవు. పోనీ మీ చెల్లెల్ని తీసుకొచ్చి తోడుంచుకుంటే....?"

"ఈ సంవత్సరం దానికి పెళ్ళి చేయా లనుకుంటున్నారు. ఇప్పుడు పంపిస్తారా?" అనుమానంగా చూసింది లక్ష్మమ్మ.

రామయ్య సలహా ఆమెకు కూడా నచ్చింది. చెల్లెలయితే అన్నీ నెట్టుకు పోతుంది—పెళ్ళయేంతవరకైనా. కానీ, తన పుట్టింటి వాళ్ళు పంపుతారని నమ్మకం ఏమిటి?

"నువ్వు పని మనిషిని పెట్టుకోవు,

ఎవర్నీ తీసుకు రావద్దంటావు. నువ్వు అలా దగ్గుతూ బాధ పడుతూంటే, ఊరి పెద్దగ వుండి కూడా యింట్లో సరిగా చూసుకోలేక పోతున్నాడని నలుగురూ నన్ను ఏమనుకుంటారు?''

ఈ విషయం గురించి లక్ష్మమ్మ ఎన్నో మార్లు ఆలోచించింది. అప్పుడు అతని మాట తీసివేసింది. కానీ, ఈసారి ఎదురు చెప్పలేక పోయింది. చెల్లెల్ని తోడుగా వుంచుకొనేందుకు సమ్మతించింది.

''సరే! మీరు రేపు పొద్దుటే వెళ్ళి తీసుకొని రండి. కొద్దిరోజులు వుంచుకొని పంపతామని చెప్పండి.'' అంది.

"అట్లాగేలే!'' అంటూ లేచిపోయాడు రామయ్య-అప్పుడే ఎవరో గుమ్మం వైపు కేకలేస్తే.

లక్ష్మమ్మకు చిన్న దగ్గు తెర వచ్చి మాయమైంది. ఆమె ఆలోచనలు వంట గది వైపుకు మళ్ళాయి. తనలా పడు కుంటే రాత్రికి ఆయనకు భోజనం?

నీరసంగా లేచింది. విడిపోయిన కుచ్చెళ్ళను సరి చేసుకుంటూ వంట గదిలోకి నడిచింది.

పొయ్యిమీది అన్నం పూర్తిగా పాడైంది. నేల పాలుకూడా అయింది?

దాన్ని తలుచుకుంటే తన జీవితం లానే వుందని మరోమారు అనుకుంది లక్ష్మమ్మ. తనలో అణగారిపోయిన ఉద్రేకంలా పొయ్యికూడా చప్పగా చల్లారి పోయింది.

పాడైపోయిన అన్నం గిన్నెను దించి అవతల పెట్టింది. పొయ్యిలోవున్న పచ్చి కట్టెలు లాగేసింది. చుట్టూతా పడివున్న అన్నాన్ని తుడిచేసింది. పెరట్లోకి వెళ్ళి ఎండు పుల్లలు ఏరి తెచ్చి, పొయ్యిలో పెట్టింది. కాస్తఎక్కువగానే కిరసనాయిలు పోసి ముట్టించింది. ఎసరు కడిగి పొయ్యి మీద వేసింది. నిశ్చింతగా మండుతూన్న కట్టెలను చూస్తూ కూర్చుంది. ఆమెలో ఏవేవో ఆలోచనలు వస్తున్నాయి.

నిజంగా తనభర్త ఎంత మంచివాడు! తను రోగిష్టిదని తెలిసికూడా మరోపెళ్లి చేసుకోలేదు. చేసుకుంటే తను మాత్రం ఏం చేయగలదు? అలా జరగకుండా వున్నందుకు కారణం—తొలి సంవత్సరాల్లో యిద్దరూ బాగుండటమే! అదీగాక, అవసరమైనప్పుడు అతను చేస్తున్న నిర్వాకాలకు అడ్డు తగలకుండటమే!

---

భర్త : ఇంతకూ, నీకూ మా అమ్మకూ పోట్లాట ఎందుకు వచ్చినట్టు?

భార్య : మరి నేనేమో మీరు నిద్రపోవటంలో కుంభకర్ణునికి అన్నగారనీ, మరి మీ అమ్మగారేమో మీరు తిండితినటంలో భీమునికి అన్నగారనీ వాదించుకొన్నాం.

—టి. యస్. మోహన్ బాబు, తిరుపతి

మగవాడు తన మంచిమాటలతో అదుపులో పెట్టుకోవాలి స్త్రీ. అతని మనసెరిగి ప్రవర్తించాలి. మంచి మనసుతో అతన్ని ఆకట్టుకోవాలి -ఆనాడు నువ్వే సర్వస్వం అంటాడు, పూర్తి త్యాగం చేస్తాడు. ప్రపంచంలో ఎవరిమాటకు యివ్వనంత గొప్ప విలువ యిస్తాడు. తన సర్వస్వం ఆమెగానే చూసుకుంటాడు. అది తప్పిన నాడు ఎవరిదారి వారిది. మనసులో ప్రేమ వున్నా, ఆశ మరో వైపుకు లాగుతూం టుంది. మంచి ప్రేమ కాస్త కపటంగా తయారవుతుంది. కొద్ది కాలానికి నీచంగా చూడటం ప్రారంభిస్తాడు—అలా జరగ కూడదనే ఆశయంతో బహు జాగ్రత్తగా ప్రవర్తిస్తూంది. కారణం తనభర్త తనకు దూరమవుతున్నాడనే వార్త ఆ వూరిలో యిట్టే ప్రాకిపోతుంది. కారణం అది చిన్న పల్లెటూరు కావటం, రామయ్య వూరి పెద్దకూడా అవటం! అప్పుడు వూళ్లో తనకేం విలువ వుంటుంది? పనికి రాని వాళ్ళతో కాలం వెళ్ళబుచ్చాల్సిందే!!

ఆ రాత్రి రామయ్యకు అన్నం వడ్డిస్తూ "రేపే వెళ్ళి కాంతాన్ని తీసుకొనిరండి" అంది.

"ఇన్నాళ్లనుంచి వద్దన్నావు? ఇప్పుడు తొందర చేస్తున్నా వేం?" చలోక్తిగా అన్నాడు రామయ్య.

"ఇంక నాకు ఓపిక లేదయ్యా ." తనూ సరదాగానే అంది.

"అదేమిటే? ఓపిక ఉందంటూ రోజూ అనేదానివి, ఇప్పుడు ఓడిపోయినట్లు ఓపిక లేదంటున్నావు?" ఓరగాచూస్తూ అన్నాడు రామయ్య.

"ఎల్లకాలం ఓపిక వుంటుందే! ఎప్పుడో ఒక రోజు పోక మానుతుందా?"

"అయినా నువ్వు కన్నెపిల్లలానే కనుపిస్తున్నావు నా కళ్ళకి!"

"పచ్చ కామెర్లు కమ్మినోళ్ళకి లోక మంతా పచ్చగానే కనుపిస్తుందటలే ..."

"నీ కవిత్వంతో చస్తున్నానే....పుస్త కాలన్నీ చదివి నా ముందు ఏకరువు పెట్టావు .... రేపట్నించి మీ చెల్లెలికి నేర్పు.. " అంటూండగానే వేడి వేడి చారు చేతిమీద పోసింది.

రామయ్య చెయ్యి చురుక్కు మంది. "ఇదేమిటే ఈ మొద్దుబారిన చెయ్యిమీద పోస్తే చురుక్కు మనాల్సిందే కాని. నీ కోపం తగ్గదు, అందుకే ఆ గరిట తీసుకొని, నాలుగు బాదరాదూ అప్పుడు నీ కోపం చల్లారుతుం దేమో!!" రామయ్య నవ్వుతూ అన్నాడు.

రామయ్య నవ్వుతోబాటు లక్ష్మమ్మ కూడా కిలకిల నవ్వేసింది. నవ్వుతో బాటు దగ్గుకూడా తోడయింది. నిగ్రహించు కుంటూనే నవ్వుతూ రామయ్యకు వడ్డన పూర్తి చేసింది.

లక్ష్మమ్మ ఆ రాత్రంతా దగ్గుతూనే వుంది, ఆ కారణంగా సరిగా నిద్ర పోలేదు.

వేకువనేలేచి రామయ్యను ప్రయాణం చేసింది. —పదిహేను మైళ్ళ దూరంలో వున్న తన పుట్టింటికి.

తలి తండ్రులు దూరమై సోదరుని పెంపకంలో పెరుగుతున్న కాంతమ్మను, లక్ష్మమ్మకు సాయంగా వుండాలని చెప్పి సాయంత్రానికల్లా తన యింటికి వెంట బెట్టుకొని వచ్చాడు రామయ్య.

చెల్లెల్ని చూసిన లక్ష్మమ్మ నిశ్చేష్టురా లైంది. పదహారు సంవత్సరాలు కూడా దాటని కాంతం నవయవ్వనం తొణికిస లాడుతూంది. మాంచి ఆజానుబాహు రాలుగా తయారైంది. కండపుష్టి నిండుగా వుంది.

తనవారిని చూశానన్న ఆనందంలో రోగాన్నే మరచిపోయింది లక్ష్మమ్మ? ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయింది.

మరునాటి వుదయం రామయ్య సల హాపై దగ్గరలో వున్న పట్నంలోని డాక్టరువద్దకు వెళ్ళింది లక్ష్మమ్మ. వంట భారం తగ్గి. బయటి ప్రపంచాన్ని ఎంతో కాలం తర్వాత చూసిన ఆమెకు ఎంతో ఆనందంగా వుంది, సాయంత్రానికి డాక్టరు యిచ్చిన మందులతో ఆనందంగా యింటికి తిరిగొచ్చింది లక్ష్మమ్మ.

గుమ్మంలో అడుగుపెట్టగానే ఆమె ఆనందమంతా మాయమైంది. ఇంటి వాతా వరణం పూర్తిగా మారిపోయివుంది. పెళ్ళి సందడితో కళకళ లాడబోతున్న మార్పు కనుపించింది.

రామయ్యను ప్రశ్నార్థకంగా చూపింది, నిర్లక్ష్యంగా వరండాలోకి వెళ్ళిపోయా డతను.

వంటగదిలో వెక్కి-వెక్కి- ఏడుస్తున్న కాంతమ్మ దగ్గరకు వెళ్ళింది.

''బావ నన్ను పెళ్ళి చేసుకుంటాడట ఈ రాత్రి" బావురుమంది కాంతమ్మ.

లక్ష్మమ్మ గుండెలు ఒక్క-సారి జారి పోయాయి.

ఆవేశంతో వరండాలోకి వచ్చింది, తాపీగా చుట్టకాల్చుకుంటున్నాడురామయ్య. క్షణంవరకు ఎవ్వరూ మాట్లాడలేదు.

"ఏంది నువ్వుచేసేపని?" నిర్లక్ష్యంగా అడిగింది.

అతని చిరనవ్వులో విషం కురిపింది.

"ఏం? నాకు హక్కు- లేదా? నేను దాని బావను. దాన్ని నేను చేసుకునే అధి కారం ఉంది. ఈ వూళ్లో నా మాట ఎవడు కాదంటాడు?"

"తను యింతవరకు భక్తితో కాపురం చేస్తున్న రామయ్యలోని అసలు మనిషి బహిర్గతమయ్యాడు.

లక్ష్మమ్మ మాట్లాడలేక పోయింది. అతనన్నట్లు ఈ వూర్లో అతని మాటకు ఎవరూ ఎదురుచెప్పలేరు.

"అయితే నన్నింతకాలంగా మోసం చేసిం దిందుకా?" ఆఖరుకు అడిగింది.

"తప్పేముందే! నీకు పిల్లలు లేరు, రోగిష్టిపిదానివి. నీ చెల్లెల్నేగా పెళ్ళి చేసు కుంటున్నాను. నిన్ను బాగా చూస్తదిగా. ఇంకెవర్నయినా చేసుకుంటే చూడగలరా ఏమిటీ?" విషపునవ్వు నవ్వాడు.

అతనితో మాట్లాడి ప్రయోజనంలేదని కాంతం దగ్గరకు వెళ్ళింది "లేపోదాం" అంది.

రా నన్నట్లు తల అడ్డంగా వూపింది కాంతమ్మ.

అర్థం కానట్లు చూసింది లక్ష్మమ్మ.

"మనం పోకుండా వుండేందుకు మనుషుల్ని కాపలా పెట్టాడు."

"ఎవ డడ్డొస్తాడో చూస్తాను. ఈపెళ్లి ఎలా జరుగుద్దో చూస్తాను. కాంతం యిప్పుడే వస్తాను జాగ్రత్తగా వుండు" అంటూనే వూపిరితిప్పుకోలేనంత దగ్గుతో, ఆయాసంతో పెరటివైపుకు నడిచింది లక్ష్మమ్మ.

రాత్రి పదిగంటలప్పుడు పోలీసులతో వచ్చింది లక్ష్మమ్మ. అప్పటికే యింటి ముందు చిన్న సైజు పెళ్ళి పందిరి వెలి సింది. ఎక్కువగా కాకపోయినా కొంచం హడావిడిగానే వుంది మగవారితో. పోలీ సులను చూడగానే తచ్చాడుతున్న జనం పెరటి గుమ్మం వైపుకు దారి తీశారు. రామయ్య మాత్రం చుట్ట నోట్లో పెట్టు కొని ధీమాగా కాలుమీద కాలు వేసుకొని వరండాలోనుంచి కదల్లేదు.

ఇన్‌స్పెక్టర్ మారు మాటాడకుండా యింట్లోకి వెళ్ళాడు. పెళ్ళికి కావలసిన వస్తువులన్నీ తయారుగా నట్టింట పెట్టి వున్నారు. ఒక మూలగా కాంతమ్మ ఏడు స్తోంది. ఆమెకు క్రొత్త చీరె కట్టబెట్టి వున్నారు. ఇన్‌స్పెక్టర్ వెనకాలే వచ్చిన లక్ష్మమ్మను చూసి బావురుమంది కాంతమ్మ.

ఇన్‌స్పెక్టర్ సరాసరి రామయ్య దగ్గ రకు వచ్చి చేతులకు బేడీలు తగిలించాడు.

"ఏయ్ నేనెవరు తెలుసా?" గద్దిం చాడు రామయ్య.

"అదంతా కోర్టులో చూసుకుందాం" అంటూనే బలవంతంగా రామయ్యను ముందుకు త్రోశాడు ఇన్‌స్పెక్టర్.

జడ్జి శ్రీ రామమోహనరావుగారు విచా రించిన కేసుల్లో యిదో విచిత్రమైన కేసు. కారణం కాంతమ్మను మోసం చేసి తీసు కొచ్చినది కాదు—పెళ్ళి చేసుకుంటానని. ఎవరికీ తెలియకుండా ఎత్తుకొచ్చిన రీతీ గాదు. లక్ష్మమ్మకు వంట్లో బాగోలేదంటే పెద్దలు సమ్మతించే పంపారు. కానీ తీరా యింటికి వచ్చిన తర్వాత రామయ్యకు దుర్బుద్ధి పుట్టింది.

పై రెండు విధాలు కాదని నిరూపించేం దుకు కాంతమ్మ యింకా మైనారిటీ తీర లేదని లేడీ డాక్టర్ ద్వారా రిపోర్టు అందింది శ్రీ రామమోహనరావుగారికి.

అందులో మొదటి టెస్ట్ ద్వారా పద్ధె నిమి దేళ్ళు నిండనిదే రాని ప్రక్క పళ్లు (Wisdom Teath) యింకా రాలేదు. రెండవది మోచేతి జాయింట్స్‌లో వున్న కాల్షియమ్ యింకా బోన్‌ఫార్మేషన్ అవలేదు. మూడవది అంతర్గహితంగా శరీరంలో కొన్ని స్థలాల్లో వుండే కేశాలు సరిగా కనుపించలేదు.

పై రిపోర్టును బట్టి జడ్జిగారు దీనిని బెదిరింపులతో లొంగదీసుకునేందుకు ప్రయత్నించిన కేసుగా నిర్ణయించు కున్నారు.

తర్వాత యస్. ఐ. సాక్ష్యం కూడా ఈ కేసుకు బాగా బలపడింది. తాళి, కొత్త చీర, జాకెట్టు, తదితర పెళ్ళి సామా నులు.

అయితే ఈ కేసులో ఒకటే గమ్మత్తు. ఊరిలో పలుకుబడిగల రామయ్య తరపున ఎవ్వరూ సాక్ష్యం చెప్పలేదు. అతనికి సాక్ష్యులే లేరు.

శ్రీ రామమోహనరావుగారు అడిగిన ప్రశ్నలన్నింటికీ రామయ్య నాకు తెలియ దంటూ తప్పించుకున్నాడు.

ఫలితంగా రామయ్య పెద్ద మొత్తం జరిమానా. కఠిన కారాగార శిక్ష విధిం చారు. జరిమానా డబ్బు కాంతమ్మకు చెందేట్లు తీర్పు చెప్పారు శ్రీ రామమోహన రావుగారు.




(గత సంచిక తరువాయి)

"నీ మంచితనము నిన్ను కాపాడింది. నీ తల్లి, తండ్రులు చేసిన పుణ్యము నీకు అడ్డుపడినది. అమ్మ జన్మలో మారదు. ఇక ఆ జీవి అలా దాటిపోవాల్సిందే. ఇప్పుడింకా కోపం, విసుగు యెక్కువయ్యాయి."

"ఏమిటో చిత్రంగా ఉందికదూ? పోయిన సంవత్సరము ఈ రోజులలో యెప్పుడయినా అనుకున్నామా? ఒక్క సంవత్సరంలో యెంత మార్పు!"

"ఏమే! యింకో అర్ధగంటలో ప్లేను వస్తుందట. ఇవిగో పూలు" కర్ర వూపుకుంటూ యెవరి చేతనో పూలు పట్టించుకు వచ్చాడు. "వాళ్ళు యెవరు? నీకు స్నేహితులకు, స్నేహితురాండ్లకేం కరువు?"

"అక్కడుంటాను. తిరిగి వచ్చాక ఒకసారి మా యింటికి రా, తెలుసుగా?" శశి లేచి, చలపతితో వెళ్ళిపోయింది. శశి

భర్త మునలివాడు? అమ్మో! తను కొంచెము ఆలస్యం చేస్తే? అతనికి దాసీ దయ్యేది.

"హాట్, కోల్డ్! ఏమైనా కావాలా?" సుధీర్ వచ్చాడు. వద్దన్నట్టు తలూపింది. ఆమెకు ఏర్‌పోర్ట్ అంతా చూపేసరికి విమానం వచ్చింది. "పదండి. అదే నన్నారుగా?"

"అదే, కాని వాళ్ళు అనౌన్స్ చేస్తారు. అప్పటివరకు వేచియుండాలి. తెల్సిందా?" చిన్నగా భుజం తట్టాడు. "ఇక్కడ విమానములో యెక్కే వారికంటే సాగనంపే వారే యెక్కువ ఉన్నట్టున్నారే."

"అవును. బంధువులు, ఆత్మీయులు, స్నేహితులున్నవారు, దూర దేశాలకు వెళ్ళేవారిని సాగనంపనస్తారు. మన పనే బావుంది కదూ? నాకు నీవు, నీకు నేను." అన్నాడు. నవ్వుతూ అన్నాడో బాధపడుతూ అన్నాడో తెలియదు. ఆమెకు కూడా రెండు నిమిషాలు అదోలా అనిపించింది. ప్రతివారికి యెవరో ఒకరు ఉంటారు. తనకెవరూ [illegible] క్షణమే సుధీర్‌కంటే బంధువులెవరు అని తృప్తి చెందినది. శశి యెక్కడా కనిపించ లేదు. "మీ బాసు యెక్కడ?" అని అడిగింది.

"అతనా? యెక్కడని చెప్పను? సినిమా హాళ్ళన్నీ వాడివే. క్లబ్బులలో యితను లేనిదే పని జరుగదు. ఎన్ని పనులున్నా మనకోసం వచ్చేవాడే. వాడి అభిమాననటుడిసినిమాఉంది." అంటుండగానే ఢిల్లీ వెళ్ళే ప్రయాణికులు తమ, తమ సీట్లల్లో కూర్చోవచ్చునని అనౌన్స్ చేశారు. అతని చెయ్యి పట్టుకుని విమాన మెక్కింది. అందులో అడుగు పెట్టగానే క్షణం [illegible]ణికింది. ఇద్దరూ వెళ్ళి తమ సీట్లలో కూర్చున్నారు. తరువాత విమానము తలుపులు మూసి, బెల్ట్ పెట్టుకోమని మైకులో చెప్పారు. సుధీర్, సుశీల బెల్ట్ పెట్టి తనది పెట్టుకున్నాడు. ఏర్‌హోస్టెస్ ఒక ప్లేటులో దూది తెచ్చి యిచ్చినది. [illegible] కొంచెం, కొంత తీసుకుని చెవులలో పెట్టుకున్నారు. "ఎందుకూ?" అని అడిగింది సుశీల.

"పైకి [illegible]ప్పుడు రొద చెవులలో బాధగా వుంటుంది. అందుకు." విమానము పైకి లేవగానే, యేదో త్రిప్పి నట్టు [illegible]. పరవాలేదన్నట్టు, తన చేయి ఆమె భుజంమీదుగా వేశాడు సుధీర్. ఒక లెవెలకు ఎగిరాక, ఎలాంటి [illegible] తెలియలేదు. కిటికీగుండా [illegible]. ఇళ్ళన్నీ బొమ్మరిళ్ళలా కని [illegible] తెల్ల మబ్బులు దూది పింజా [illegible]లా తేలిపోతున్నాయి. ఇంతలో హోస్టెస్ కాఫీ తెచ్చింది. ముందు సీటుకున్న [illegible], చిన్న టేబుల్‌లాంటి స్టేటు [illegible] ముందు అమిరింది. దానిపై కప్పు పెట్టి కాఫీ పోసింది. సుధీర్‌ను గుర్తించినట్టు చిరుగా నవ్వింది.




కాఫీ, మరో అరగంటలో పలహారము వచ్చింది. అదో నూతన అనుభవం, ఆరుగంటలకు పాలం విమానాశ్రయంలో ఆగింది.

విమానం దిగగానే వారికోసం అక్కడ ఏర్ ఇండియావారి వ్యాను సిద్ధముగా నున్నది. ఇద్దరూ అందులోకి ఎక్కారు. "మన సామాన్లు." ఆదుర్దాగా చూచింది. అతను నెమ్మదిగా తన జేబులోనుండి రెండు చీటీలు తీశాడు. "మనము వెళ్ళి ఒక పదిహేను నిమిషాలు ఆకనిపించే భవనములో ఆగితే, మన సామాను వస్తుంది. మన సామాన్లు యింకెవరయినా తీసుకునే ప్రమాదమున్నది. అందుకే ఒకే నంబరుగల రెండు చీటీలు తీసి ఒకటి మన సామానుకు కట్టి రెండవది మన కిస్తారు. ఎన్ని సామానులుంటే అన్ని చీటీలు యిస్తారు. అక్కడ మనము ఈ చీటీలు చూపించి మన సామాన్లు తీసుకోవాలి." అతని మాట పూర్తికాక మునుపే వారు దిగవలసివచ్చింది. ఇద్దరూ లోపలికి వెళ్ళి పది నిమిషాలు కూర్చుని తరువాత సామానులు తెచ్చుకున్నారు. ఏర్‌పోర్టు బయటికి రాగానే విపరీతమైన చలి వెయ్యసాగింది.

"నేను చెప్తే విన్నావా? నాకెందుకు కోటు, శాలువ అన్నావు. ఈ ఢిల్లీలో బాగా చలి ఉంటుంది."

# జరిగిన కథ

సుశీల చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని మేనత్త దుర్గమ్మ కట్టడిలో పెరుగుతుంది ఉదయం నాలుగు నుంచి రాత్రి పది వరకు విశ్రాంతి లేకుండా పని చేసినా ఇంట్లో వారి తిట్లు, దీవెనలు మాత్రం తప్పవు ఒకసారి ప్రసన్నని చూడటానికి వచ్చిన పెళ్ళికొడుకు సుశీలను చూసి ముగ్ధుడై కట్నం లేకుండా ఆమెను వివాహం చేసుకుంటాననడంతో దుర్గమ్మ మండి పడుతుంది అదే వేడిలో సుశీలను అరవయ్యేళ్ళ ధనవంతుడైన చలపతి కిచ్చి వివాహం చేయడానికి ముహూర్తం నిర్ణయిస్తుంది గత్యంతరం లేక సుశీల పెళ్ళినాటి రాత్రే నగలన్నీ తీసివేసి ఇల్లు విడిచిపోతూ సుధీర్ అనే అతని కారు క్రింద పడుతుంది అదే ముహూర్తానికి అప్పటికే అక్రమంగా గర్భం ధరించిన తన రెండో కూతురు శశిని యిచ్చి వివాహం చేస్తుంది హాస్పిటలు నుండి తిరిగి వచ్చిన సుశీలను, సుధీర్‌ను కలిపి నానా దుర్భాషలు మాట్లాడుతుంది దుర్గమ్మ సుధీర్ పంతంగా ఆమెను తన ఇంటికే తీసుకు వెళతాడు అతని సహాయంతో గురుకులంలో చేరుతుంది కాని అది నచ్చక తిరిగి సుధీర్ వద్దకే వచ్చి ట్యుటోరియల్ కాలేజిలో చేరి మెట్రిక్ పాసౌతుంది ఒంటరిగా, వయస్సులో ఉన్న ఆడపిల్లని ఇంట్లో ఉంచుకోవడం మంచిది కాదని సుధీర్‌కు అతని బాస్ చేసిన హెచ్చరిక, దానికి అతని సమాధానం విని సుశీల ఆశ్చర్య పోతుంది అదే మనసులో ఉంచుకుని మర్నాడు గుడి నుంచి తిరిగి వస్తున్నప్పుడు తను అతన్ని వివాహం చేసుకుంటానని చెపుతుంది వివాహం క్లుప్తంగా జరిగి పోతుంది ఢిల్లీకి వెళ్తూ ఏరోడ్రోమ్‌లో సుశీల శశిని కలుస్తుంది పెళ్ళయ్యాక ఏడు నెలలకే ఆరోగ్యంగా పుట్టిన పాపవైపు అనుమానంగా చూచే చలపతిని, తన ప్రియుని బెదిరింపులను గూర్చి చెప్పి రోజూ నరకం అనుభవిస్తున్నాను అంటూ నిట్టూర్చుతుంది శశి చితికిపోయిన తన మేనత్త కుటుంబ పరిస్థితులు తెలుసుకుని సుశీల చాల బాధ పడుతుంది

—ఇక చదవండి.

"ఫరవా లేదు, మన దగ్గర కూడా యింత చలి ఉన్నప్పుడు లేచి చెట్లకు నీళ్లు పోసేవాన్ని."

"మొండి మనిషివి. ఇక్కడ కొనాలి" ఆటోరిక్షాను పిలిచి యెక్కి ఏదో హోటల్ పేరు చెప్పాడు. పట్నం ఏర్‌పోర్టుకు చాలా దూరం. రివ్వుమని వచ్చే గాలి, చలి, విశాలమైన భారత రాజధానిరోడ్డులు; వణుకుతూ అతనికి దగ్గరగా జరిగింది. అతను ఓరగా చూచి నవ్వాడు. "అయిందా అమ్మాయిగారి పని?" భుజాల చుట్టూ తన చేయివేసి యింకా దగ్గరకు తీసుకున్నాడు.

రెండవ రోజు ఇద్దరూ తయారయ్యే సరికి టిఫిన్ వచ్చింది. టిఫిన్ తీసుకుంటూ, సుశీల అభిప్రాయం అడిగాడు. "సుశీ! ఢిల్లీ నాకు కొట్టిన పిండి పట్నం అంతా చూడాలంటే, ఆటోలో వెళ్ళవచ్చు. లేదా టూరిస్టు బస్సులుంటాయి. వాటిలో వెళ్ళవచ్చు." అన్నాడు.

"టూరిస్టు బస్సులు ఈ హోటలు కొస్తాయా? లేక బస్సుడిపోకు వెళ్ళాలా?"

"రెండూ కాదు ఇక్కడికి కొంచెము దూరంలో కన్నాటిప్లేస్ అని ఓ పెద్ద బజారుంది. అక్కడి నుండి బయలు దేరుతాయి. టూరిస్టు బస్సులో అయితే పదిమందితో వెళ్ళినట్లుంది. మనకు తెలియనివి చెప్పడానికి ఓ గైడ్ ఉంటాడు. కాని కొన్ని నిముషాలే సమయము యిస్తారు."

"అయితే వేరుగా వెళ్దాము. గైడ్ చెప్పడం దేనికి? మీరున్నారుగా?" అన్నది. మెడలో హారము సర్దుకుంటూ. మొట్టమొదట ఆటోలో ఎర్రకోటకు వెళ్ళారు. 'లాల్ ఖిలా' ప్రసిద్ధిగాంచినది. పైన రంగంతా ఎఱ్ఱదే. అక్కడ యిరవై పైసలు పెట్టి యిద్దరికీ టికెట్లు తెచ్చాడు. పెద్ద యినుప గేటుదాటి లోపలికి వెళ్ళినారు. కుడిచెయ్యి ప్రక్కకు తిరిగి యాభై అరవై గజాలు నడువగానే రెండువైపులా కొట్లు కనిపించాయి. అన్నీ అలంకార వస్తువులే. అవికాక చిన్న, చిన్న హోటళ్లు చల్లని పానీయాలు అమ్మే దుకాణాలు ఉన్నాయి. మురాదాబాద్ గ్లాసులు, ఫ్లవర్ వాజులు, యాష్‌ట్రేలు, గుండీలు, రక, రకాల రంగుల్లో చూపరుల నాకర్షిస్తున్నాయి. మరో కొట్టులో పాలరాతితో చేసిన జంతుజాలములు, తాజ్‌మహల్‌కు ప్రతిగాచెక్కిన చిన్న, చిన్న తాజ్‌మహల్లూ ఉన్నాయి. సానికట్నూ మొదలగు ఉపయోగమైన సామానులు కూడా ఉన్నాయి. అవి దాటి మరో కొట్టుముందు ఆగినారు. భారతదేశంలో ఉన్న అన్ని రకముల గాజులున్నాయి. అవి అన్నియూ మొగల్ సామ్రాట్టుల అభిరుచులకు చిహ్నాలే.

"కొంటావా సుశీ" భార్య అడగా, ఆనందంగా వాటి వంక చూస్తుంటే అడిగాడు సుధీర్.

"తిరిగి వెళ్ళేటప్పుడు కొందాము అన్నీ మోసుకుని ఎలా తిరుగుతాము?"



అన్నది. మరో కొట్టువద్దకు నడిచారు. రెక్సిన్, రబ్బరు, స్పాంజి, గుడ్డ, నార, ప్లాస్టిక్, యిన్నింటితో చేసిన పర్సులు, బుట్టలూ అమర్చారు. ముఖ్యంగా నల్లని ముఖమల్ గుడ్డపై జరీతో హంసలు, మహళ్లూ, నెమళ్ళూ మొదలగునవన్నీ కుట్టిన పర్సులు చూడ ముచ్చటగా ఉన్నాయి. మరోచోట పిల్లల ఆట సామానులు, రంగు, రంగుల గాజుమేడలు, వాటిలో చిన్న, చిన్న జంతువులు, ఇవి బల్లలమీద అలంకారానికి పెట్టే వస్తువులు. కొంచెము దూరం వెళ్ళగానే రక, రకాల నకిలీ సొమ్ములు (నగలు) వాటి పనితనము మెచ్చుకోవచ్చు. అవి దాటగానే, ఓచోట మనుషులు గుంపులుగా చేరి చెరుకు రసం త్రాగుతున్నారు.

అటునుండి కొలది దూరం వెళ్ళగానే. మూడు దోవలు చీలినాయి. రెండు ఎడమ, కుడికి ఒకటి చిన్నగా ఎదురుకు దారి తీయుచున్నది. "ఆ ఎడమ వైపుదారి సైనికులుండే యిళ్ళకు దారితీస్తుంది, కుడి ప్రక్క కూడా కొన్ని యిళ్ళున్నాయి. షాజాహాన్ కాలములో దాసీజనం, మొదలగువారు నివసించేవారేమో, ఇప్పుడు కూడా కొందరు ప్రభుత్వ ఉద్యోగులు నివసిస్తున్నారు," అతనిమాట పూర్తికాకమునుపే, మార్చి చేసుకుంటూ, ఓ సైనిక దళం ఎడమవైపునుండి వచ్చింది. వీరు తిన్నగా వెళ్ళినారు అక్కడ హాలుంది. కొందరు మనుషులు ఏదో లెక్కలు చూచుకుంటున్నారు. దాంట్లోనుండి ముందుకు వెళ్ళగానే యెదురుగా, అంతా పలుచ

రాతితో కట్టిన పెద్దహాలు కనిపించినది దాంట్లో, పెద్ద పెద్ద స్థంభాలు, మధ్య యెత్తయిన ఆసనములున్నాయి. వెనుక గోడకు చిన్న, చిన్న కిటికీలున్నాయి. ముందు పెద్ద ఖాళీ స్థలముంది. "చూడు సుశీ; దీనిని 'దివానే ఆమ్' అనేవారు. 'ఆమ్' అంటే, అందరికీ ఇందులో ప్రవేశించే అర్హత ఉంటుంది. ఇది కూడా షాజాహాన్ కట్టాడని అంటారు. ప్రజలకు తమ సుఖ దుఃఖాలు ప్రభువుతో చెప్పుకో వాలనిపించినా, నేరస్తులను విచారించ దలిచినా అందరూ సమావేశం అయ్యే వారు. ఈ ఖాళీ స్థలములో మామూలు ప్రజలు కూర్చునేవారు. యెంత లేదన్నా రెండువేలమంది తేలికగా కూర్చుంటారు. ఆ పెద్ద హాలులో ప్రభుత్వ ఉద్యోగులు పెద్ద మనుషులు కూర్చునేవారు. యెత్తయిన ఆసనము మీద ప్రభువులు కూర్చునే వారు. ఆసనము యెదురుగా మంత్రిగారు నిలబడి, ప్రజలు చెప్పేది వినేవాడు. ఆ చిన్న గవాక్షముందే కిటికీలాంటిది, అక్కడి నుండి బయట జరిగే విషయాలను తిలకించే వారు అంతఃపురస్త్రీలు. బయటి వారిని వారు చూడవచ్చు కాని వారిని బయటి వారు చూడరాదు."

"ఇదెక్కడి న్యాయము? తమ స్త్రీలకు అంత ఘోషా దేనికో?"

"స్వార్థం. అపనమ్మకం. ఒక్కొక్కరికి లెక్కలేనంత మంది భార్యలు. అనుక్షణము వారిని అనుమానిస్తూ జాగ్రత్తగా కాచేవారు. అంత ఘోషా వున్నా జరిగే ఘోరాలు జరుగుతూనే ఉండేవట. పురుషులు కొజ్జాల వేషం వేసుకుని, స్త్రీ మందిరాలలో యధేచ్ఛగా సంచరించే వారట."

"అంత రహస్యంగా యెలా నెట్టుకు వచ్చేవారు? ఆ సంగతి బయట పడదా?"

"యెందుకు పడదు? పడ్డనాడు నేరస్తులను గుట్టు చప్పుడు కాకుండా యమునానది పరము చేసేవారుట. గొప్పవారి గోత్రాలనిండా కథలేలే."

రాతిని రాతిని జత చేయటానికి మధ్య ఏం వాడినారో? వారెటువంటి వారయినా కొన్ని దశాబ్దాలపాటు ప్రజలలో వారికీర్తి నిలిచి పోయే ఈ కట్టడములు మాత్రం కట్టుట అభినందనీయము" అన్నది తన్మయత్వముతో రాళ్ళను తాకి చూస్తూ.

"వాడికేం నొప్పి! ప్రజలను పీడించి తెచ్చిన ధనము. వారిని ఈడ్చుకువచ్చి, రక్తం నీరుగా చేయించి కట్టించినారు." నీరసంగా నవ్వాడు సుధీర్. అతనికి ప్రభువులన్నా, వారి నిరంకుశత్వమన్నా గిట్టదు. మరేం మాట్లాడక, దాని ప్రక్కగా ఉన్న దారి గుండా 'దివానే ఆమ్' వెనుకవైపుకు వెళ్ళారు.

తరువాత అటునుండి దాని కెదురుగా ఉన్న భవనంలోకి నడిచారు. "ఆ వెనుక ఉన్న చిన్న-చిన్న గదులు అంతఃపుర స్త్రీల అలంకార మందిరాలు ఇదే 'ఖాస్

మహల్' అంటే ప్రత్యేక మందిరము. దీనిలోనే పీకాక్ త్రోన్ ఉండేది. 'కోహీనూర్' వజ్రము ధరించిన ప్రభువు దీనిపై ఆసీనుడై తన ప్రత్యేక సదస్యులతో ముచ్చటించే వారు. దానిని ఆంగ్లేయులు తన్నుకు పోయారు. నేరుగా మెట్లు-మెట్లుగా కనిపిస్తుందే అక్కడి నుండి నీరు ఆ క్రింది హౌజులోకి ప్రవహించేది. అంతఃపుర స్త్రీలతో అక్కడ కాలం గడిపేవారు. వెనుకవైపు తలుపు సైజులో కిటికీలున్నవే, వాటిని నేరస్థులను గుట్టుగా యమునా నది పరం చేయటానికి ఉపయోగించేవారు.'' ఆ కిటికీ దగ్గరకు నడిచారు. యమున చాలా దూరంలో కనిపించినది. "అంతదూరం ఎలా విసిరి వేసేవారండీ?" భయంగా చూచింది.

''అప్పుడు యమున ఎఱ్ఱకోట ప్రక్కగానే ప్రవహించేది. రాను-రాను యిటు మట్టి, యిసుక పేరుకు పోవటంతో అటు దొర్లినది ఇదిగో యీ కనిపించేది 'రంగమహల్' అంటే రంగు-రంగుల మహల్ అని అర్థం. పైకప్పు అద్దాలతో చేయబడినది. రాను-రాను అద్దాలు ఒలిచి వేశారు. ఆ మధ్యలో ఒక గజము వ్యాసార్థము గల చలువరాతి కలువ, దాని మధ్య నుండు రంగు-రంగు ద్రవాలు పౌంటెన్లలా యెగసి ప్రవహించేవి. దీని చుట్టూ స్త్రీలు, పురుషులు కూర్చుని వినోదించే వారు అదిగో ఆ కనిపించేది 'షీష్ మహల్' అంటే అద్దాల ... అటు దారి తీశాడు సుధీర్.

''ప్రతి భవనము చలువ రాతిదే. ఎక్కడ లభించిందో ఈ రాయి?'' కనులు పెద్దవి చేసింది సుశీల.

''డబ్బుతో మాట. డబ్బుంటే కొండ మీది కోతి కూడా దిగి వస్తుంది. ప్రజలను దోచారు, పరపతి నిలుపుకున్నారు. శృంగార పురుషులు, ఈ షాజహాన్‌కు ఎంత లేదన్నా రెండు వందలకు పైనే భార్యలుండే వారుట. అతనికి చాలా దగ్గరగా వచ్చి, ప్రత్యేక అభిమానం సంపాదించుకున్నది ఒక ముంతాజ్ మహలే. అందుకే ఆమె పేరున తాజ్‌మహల్ నిర్మించాడు.

''తాజ్ మహల్ చూద్దామండీ? అన్నది.

''మరి మనమొచ్చింది దేనికి? ఢిల్లీలో ఉన్నవి చూచినాక, అక్కడికి వెళ్దాము.''

''ఈ కమలములోకి నీరు ఎలా వచ్చేదో?''

''అదంతా ఇంజనీర్ల ప్లాను. ... మీన్ అప్పుడూ వుండేవారుగా? యమున నుండి వచ్చేది, అటే వెళ్ళేది. ఈ సన్నని కాలువ చూడు అన్నీ మందిరాల నుండి ఆగుతూ పోతుంది. దానిగుండా నీరు బయటికి వెళ్తుంది.'' అద్దాల మేడలో అడుగు పెట్టారు. అద్దాలు యింకా అక్కడక్కడ ఊడనవి వున్నాయి.

ఏ విలాస మందిరము క్రిందవాడె వారు. నాట్య గానాలు యిక్కడే జరిగేవి. ఒక్కొక్క నాట్యకత్తె వందలాది ప్రతి బింబాలను సృష్టిస్తూ, ప్రభువులను పరవశింప జేసేవారు.'' అద్దాలుండిన గుర్తులు పై కప్పుకు గోడలకు స్పష్టముగా కనిపిస్తూ అక్కడక్కడ ఊడని అద్దాలు దాన్ని బలపరుస్తున్నాయి. అటునుండి బయటకు వచ్చి యిద్దరూ ఒక చెట్టు నీడలో నిల్చున్నారు సుశీల ముఖం కంది పోయినది.

''సుశీ! ఫలహారము ఎప్పుడో అరిగి పోయినదిలే. మనము తిరిగింది యిక్కడిక్కడే అయినా, రెండు మైళ్లు తిరిగాము. ఇక వెళ్దామా?''

''ఇవన్నీ చూస్తుంటే ఆకలి దప్పులు గుర్తుకు రావటం లదు. ఇలాంటవి వున్నా యని ఊహించనైనా లేదు సుమండీ!'' అన్నది తృప్తిగా. ఒకచోట ఆపి చల్లని పానీయము యిప్పించాడు. పర్సులు, గాజులు కొన్నారు. ఓ బ్రాస్‌నెక్లెసు కొంటానంది. ''ఎందుకు? బంగారుది కొందాము.''

"కాదండి, దానిచేత ఎంత బావుందో!" ఆమెను నిరాశ పరచటం యిష్టం లేదు. అన్నీ కొని, ఓ ప్లాస్టిక్ బుట్టలో పెట్టుకున్నారు. ఆవురావురుమంటూ హోటలు చేరినారు. భోజనం కాగానే బట్టలు కూడా మార్చక పక్కపై పడి నిదురపోయినది.

నాలుగు గంటలకు మళ్ళా బయలుదేరి జామా మసీదు చేరుకున్నారు. ప్రొద్దుట

---

అప్పారావూ సుబ్బారావూ ఓ హోటల్లో టిఫినారగిస్తున్నారు.

"అప్పారావ్, రేడియో రిపేరింగ్ నీకొచ్చా?''

''ఓ! కారు రిపేరింగ్ కూడా వచ్చు!"

''మద్దిల వాయించడమో?''

''అదేకాదు, పియానో, ఫిడేల్, హార్మణీ కూడా వాయించగలను

''టెన్నిస్ ఆడ్డం వచ్చా''

''టెన్నిసేనా? క్రికెట్, ఫుట్‌బాల్, వాలీబాల్, గోల్ఫ్ ఇవన్నీ మనకి కొట్టిన పిండి ''

''నీకు చేతకాని పనంటూ ఏదీ వున్నట్టులేదే!'' అంటూ వేళాకోళంగా చూసేడు సుబ్బారావు

'ఎందుకు లేదూ, ఫ్రెండ్ మాట వరసకి ఈ టేబిలాపేదున్న బిల్లుని చెల్లించటం నాకు చేతకాదు!' అన్నాడు అప్పారావు

కెమరా మరిచినందుకే బాధ పడినాడు. ఈసారి కెమెరా లోడ్ చేసుకుని తెచ్చాడు. ఎత్తయిన భవంతి పైన కట్టబడిన పెద్ద మసీదు. పైన ఎఱ్ఱరంగు పూసినా, లోప లంతా చలువ రాయే. మసీదుకు ఒకవైపు తలుపు, ఇరువైపుల మంటపాలవలే పెద్ద హోల్లున్నాయి. దాని శిఖరముపైన పావు రాలు ఎగురుతున్నాయి.మసీదుకు మధ్యగా, దాని ఎదురుగా నీటి హౌజు, దాని నలు మూలలా సన్నని కాలువలలా మోరీలు, కాళ్ళు చేతులు కడిగిన నీరు బయటికి పోతుంది. అక్కడ సుశీలను నాలుగైదు పోజులలో ఫోటోలు తీశాడు. "మీరు?" అంది.

దూరముగా విల్చున్న అమెరికన్ దంపతులతో తమ యిద్దరినీ ఒకేసారి ఫోటో తీయించాడు సుధీర్.

వాళ్ళని తను తీశాడు. అక్కడి నుండి శ్రీ॥ పూ॥ శాస్త్రిగారిని దహనము చేసిన స్థలము దర్శించారు. అది ఎఱ్ఱకోట వెనుకవైపున ఉంది. శ్రీ నెహ్రూగారి సమాధిని 'శాంతి వనము' అంటారు. సమాధిముందు రోజా మొక్కలు వేశారు. ఏవేవో కట్టడములకు ప్లానులున్నాయి. అక్కడ రెండు గులాబీలు కొని ఆయన సమాధి పై నుంచి నమస్కరించారు. అటునుండి రాజ్‌ఘాట్ చేరారు. అక్కడ శ్రీ గాంధిగారి సమాధి ఉంది. దూరాన యమునానది ప్రవహిస్తోంది. విశాలమైన ఆవరణలో కట్టారు. "ఇ వచ్చి వీరి పేర్లు వ్రాయిం ...

"ఎందుకు' టికెట్లు కొనాలా?"

"కాదు. ప్రతి రోజు ఎంతమంది చూచి వెళ్తారో తెలుసుకోవడానికి.... మొగలు చక్రవర్తులవి చూచినాక ఏమని పించిందోగాని నెహ్రూగారు ఈ సమాధిని దాని చుట్టూ కట్టడానికి కొన్ని లక్షలు ఖర్చు చేశాడు.'

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. చుట్టూ ఎత్తుగా కట్టబడిన గోడ, దానిలో గూళ్ళలా ఉన్న గదులు, మధ్యగా నల్లరాతితో కట్ట బడిన సమాధి రక-రకాల రాళ్ళు కని పిస్తాయి. అక్కడ శ్రద్ధాంజలి ఘటించి, నాల్గు ఫోటోలు తీసుకుని, యెడమ ప్రక్కకు తిరిగారు. ఆ గూళ్ళలా కట్టిన హాలులో, బాపుజీ జీవిత విశేషాలను తెలిపే ఫోటోలు వరుసగానున్నవి. అటు నుండి బయటికి వచ్చారు. అప్పటికే సంధ్య చీకట్లు అలముకొన్నాయి. చలి ప్రారంభమైనది. ఆటోరిక్షాలో బజారుకు వచ్చి, సుశీలకో కోటు, కాశ్మీరు శాలువా కొన్నాడు.ఇద్దరూ హోటలు చేరుకున్నారు. "సర్! మీకోసం ఒకాయన నాల్గుసార్లు ఫోను చేశాడు." కుర్రవాడు చెప్పాడు. "అతని ఫోను నంబరు యిచ్చాడు." వెళ్ళబోయి ఆగి చెప్పినాడు. త్వరగా వెళ్ళి అతనికి ఫోను చేశాడు. "హల్లో! సారీ! వంటరిగా రాలేదు నా భార్య వెంట

ఉంది. పీలు కాదు బాస్‌కు ట్రంక్‌కాల్ చేసి చెప్పండి '' ఇంగ్లీష్‌లో చెప్పుతున్నాడు. ''ఇతను చేసే వ్యాపారమేమిటబ్బా?'' అడుగుదామని, అతడు రాగానే మరిచి పోయినది. అలసటగా గది చేరినారు.

రెండవ రోజు ప్రొద్దుటే అతను పని ఉందని, ఆమెను హోటల్లో వుంచి వెళ్ళి పోయినాడు. ఒక్కర్తే. ఏమీ తోచటం లేదు. గది తలుపు బిగించుకుని మంచము పైన దొర్లినది. దొర్లి-దొర్లి విసుగు రాగానే, లేచి వచ్చి బాల్కనీలో నిలబడి నది రోడ్డుపై వచ్చే పోయే జనాన్ని చూస్తూ. మధ్యాహ్నము వచ్చినాడు సుధీర్.

''ఈరోజు పూర్తిగా విశ్రాంతి మనకు. సాయంత్రము సినిమా చూద్దాం స్టేషన్‌కు వెళ్ళి వస్తున్నాను. తాజ్ ఎక్స్‌ప్రెస్‌కు ఎల్లుండికి రిజర్వేషన్ చేయించాను. రేపు ఢిల్లీలో మిగిలినవి చూచి అక్కడికి వెళ్దాము.'' ప్రోగ్రామ్ అంతా గడ-గడా చెప్పి వేశాడు.

''మీరలా బయటికి వెళ్ళారా? నాకైతే ఏం తోచలేదు. ఏవైనా తెలుగు మాగజైన్స్ తెప్పించరా!'' అన్నది, తను పడిన విసుగంతా ముఖంలో కనపరుస్తూ.

''అది ఊహించే తెలుగు పత్రికల కోసం వెతికాను. అరవం, మళయాళం, కన్నడం అన్ని భాషలలో ఉన్నాయి పత్రికలు కాని తెలుగులో మాత్రం దొరక లేదు.''

''అదేం? భారత రాజధానిలో తెలుగు వారే లేరా'' ఆశ్చర్యంగా చూచినది.

''ఎందుకు లేరు? చాలామంది ఉన్నారు కాని తెలుగు తమ భాష, తెలుగు పత్రికలు తాము చదువుట ఏనాడో మరిచిపోయారు. వాటి పేరెత్తితేనే తమ స్టాండర్డ్ తక్కువయినట్టు భావిస్తారు. మనవారు యిక్కడ ఎవరయినా కనిపించినా తెలుగు రానట్టే నటిస్తారు ''

''ఎందుకు? అన్ని భాషలకంటెది మన భాష. ఇతరులు అంత ఆరాట పడుతూ తమ భాషలకై ప్రాకులాడుతుంటారే! ఒక అరవ మామి, రెండో మామి కని పించగానే పరుగెత్తుకు పోయి, ప్రక్కన మనష్యులున్నది కూడా గమనించక వారి భాషలో మాట్లాడుకుంటారే ''

''అది వారి గొప్పతనం. విమర్శించాలని కాదుగాని, మన దేశభాషలను అనహ్యించుకోవటం, వారి శూరత్వము, ఆరంభ శూరత్వము ఆంధ్రుల అభిమాన విషయాలు పెట్టని సొమ్ములు ఏం చేస్తాము?'' అన్నాడు. వెయిటరు భోజనం తెచ్చాడు. ఇద్దరు భోజనం చేసి, విశ్రాంతి తీసుకుని 'షీలా' టాకీస్‌లో సినిమా చూచారు.

సాయంత్రం సినిమా నుండి లక్ష్మీ నారాయణ మందిరము దగ్గర కొచ్చారు ''సుశీ! మన హిందూ దేవాలయాలు ఎన్నో దర్శించాను. నేను కోరిన ప్రశాంతతా, పవిత్రతా యిక్కడ గోచరిస్తాయి. దీనిని

కట్టినతను బిర్లా అని ఒక ధనికుడు." ఇరువురు పాదరక్షలు వదిలి లోపలికి వెళ్ళారు. దూరంనుండి సన్నని-సుమధుర మైన కంఠముతో 'ప్రభూ తేరేనామ్‌తో అను భజన వినిపిస్తుంది. ఆ మందిరము కూడా పాలరాయితో కట్టినదే. చెత్తా, చెదారం, పూజారుల ఆర్భాటం, భక్తుల గోల అసలు లేదు. ఎదురుగా ఉన్న పొడు గాటి హాలులో మధ్యగా 'లక్ష్మీనారాయణుల ప్రతిమలు ఎడమవైపు దుర్గాదేవి ప్రతిమ కుడివైపు శ్రీశంకరునిలింగము ఉన్నాయి. ఆ మందిరము కెదురుగా విఘ్నేశ్వరుని గుడి ఉంది. కుడివైపు పైకి వెళ్ళగానే, చక్రధారి అయిన శ్రీకృష్ణుని ప్రతిమ ఉంది. అక్కడే సితార్ మీటుతూ పాడు తున్నాడో వ్యక్తి చిన్న మైకు ద్వారా, మందిరమంతా వినిపించేలా చేయు చున్నారు. మందిరము గోడలలో, తెల్లని రాతిపైన చెక్కిన నల్లని అక్షరాలతో భగవత్ గీత శ్లోకాలు, వెనుకవైపు తోట, అక్కడ తెల్లని రాయితో చేసిన జోడు గుర్రాలున్నాయి. కుడివైపున ధర్మ సత్రము. ఎడమవైపున బుద్ధ దేవుని ప్రతిమ. అక్కడ అతనికి సంబంధించిన గ్రంధాలున్నాయి. అక్కడక్కడ దారు లకు యిరువైపులా ఏనుగులు, నంది, రాతితో చెక్కినవి ఉన్నాయి. పృథ్వీరాజు విగ్రహముంది ఒక చోట. ప్రతి విగ్ర హము దగ్గర ఒక్కొక్క గల్లాపెట్టె పెట్టి ఉంది, బలవంతము లేదు. ఇష్టమున్న



వారు తృణమో, ఫణమో వెయ్యొచ్చు. లేనివారు లేదు. అందరికీ అమ్మవారి కుంకుమ ప్రసాదము లభిస్తుంది. "చాలా ప్రశాంతముగా ఉన్నది" అన్నది సుశీల తృప్తిగా నిట్టూరుస్తూ రేపు తాజ్‌మహల్ చూస్తుంది. ఒక భర్త తన భార్యపైనుండే ప్రేమ ప్రకటించుకొనుటకు కట్టాడు.... ఓహ్! ఆనందముతో తిరిగి వచ్చారు. భోజనం చేసి హాయిగా పడుకున్నారు. నాల్గు గంటలకు సుధీర్ పేర టెలిగ్రాము వచ్చింది. అది చూస్తూనే అతని ముఖం గంభీరముగా మారిపోయింది,

"సుశీ! మన తాజ్ ప్రోగ్రామ్ కాన్సిల్ అయింది. రేపు మనము హైద్రాబాద్ వెళ్ళాలి. లేకుంటే కొన్ని వేల నష్టం వస్తుంది వ్యాపారములో." అన్నాడు.

సుశీలకు నిరాశగా ఉంది. అతని వ్యాపారం ఏమిటో.... ఆ నష్టమేమిటో....

ఆమెకు అర్థం కాలేదు. "వెళ్ళి తీరాల్సిందేనా?" అన్నది.

"అవును. మరోసారి వద్దాము చెప్పు. ఎంతో అవసరముంటేనే టెలిగ్రాము యిస్తారు...." అన్నాడు ఆమె భుజాలు రాస్తూ.

"ఎంతో ఆశ పడ్డాను. తాజ్ చూస్తానని." ఆమె కంటిలో నీరూరింది.

"ఛ. కంట తడి పెడుతున్నావా? నువ్వుండలేవు. ఇక్కడే వుంచి రెండు రోజులలో తిరిగి వచ్చేవాడిని. తాజ్ అన్నీ చూసుకుని వెళ్ళేవారము" అన్నాడు.

"అమ్మో! ఒక్కర్తిని ఉండలేను... ప్రాప్తం లేదు. మరోసారి ప్రయత్నిస్తాం రావడానికి."

"అయితే రాజీ పడ్డావన్న మాట ... సుశీ చాలా మంచిది" అన్నాడు.

"ఉబ్బేయకద్దు లెండి. ఒక్క మాట అడుగనా?" అన్నది అతనికి దగ్గరగా వెళ్ళి.

"అంత సందేహము దేనికి? . అడుగు." అన్నాడు నిదానముగా.

"మరేం లేదు. మీరు చేసే వ్యాపారం ఏమిటండి? రాత్రింబవళ్లూ పని-పని అంటూ పరుగెత్తుతారు" అన్నది. అతను కొన్ని నిమిషాలు మాట్లాడలేదు. తరువాత నెమ్మదిగా చెప్పాడు.

"ఎగుమతి, దిగుమతి వ్యాపారము సుశీ! విదేశముల నుండి చవకగా ఉన్న వస్తువులు తెప్పిస్తాము. కాని ప్రభుత్వము కన్ను కప్పి చేస్తాము" అన్నాడు చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"పోదురూ! అంతా అబద్ధం. నిజం చెప్పండి" అన్నది. అతను ప్రభుత్వము కన్ను కప్పగలడంటే నమ్మలేకపోతుంది.

"సరేలే నమ్మకు. అన్నీ సర్దు-నేను గంటలో వచ్చేస్తాను." అతను వెళ్ళిపోయాడు.

* * *

శశి ఎంత మరిచిపోదామన్నా, సుశీలను ఆమె భర్తనూ మరువలేకపోతుంది. తమ యింట్లో దాసిగా పడివున్న సుశీల ... ఒక ధనిక యువకుని అర్ధాంగి. తాను? ఆకాశము అందుకోబోయి అగాధంలో పడినది. "పిన్నీ! పాప ఏడుస్తున్నది." మారుటి కుమారుని హెచ్చరింపు విని గదిలోకి వెళ్ళి పాపను తీసుకున్నది. అతను బయటికి వెళ్తున్నాడు. అతని అర్ధాంగి అయితే?" అనే ఆలోచన వచ్చింది. వెంటనే నిట్టూర్చింది. చలపతి తోటలు చూడడానికి వెళ్ళారు. మూడు రోజుల వరకు రాడు. కొంత తెరిపిగా ఉంటుంది. ఒకటే రొద.

"ఏమే! ఏమే!" అంటూ తన అందమైన పేరు విలువ లేకుండా పోయింది. పాపను ముద్దిడుకుంది. "భలే అందమైన సన్నివేశం! బావుంది శశీ...." తలెత్తి చూచింది. శంకర్ నిల్చున్నాడు.

"ఓ... నువ్వా?" అన్నది ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటూ.

(ఇంకా వుంది)

# బెటర్-హాఫ్!

ఐ.వి.యస్.అచ్యుతవల్లి



క్యాషియర్ దగ్గర నూటఏనభై రూపాయలూ లెఖ్ఖ పెట్టుకుని పుచ్చుకున్న పురుషోత్తం ఛాతీ గర్వంగా ఉప్పొంగింది. తను కూడా వుద్యోగస్థుడుగా ఇప్పటికి నల్గురిలోనూ గుర్తింపబడతాడు.

ఆఫీసు బయటకు వొచ్చి పేవ్‌మెంట్ మీద నిలబడ్డాడు. బి. కాం. పాసయినాక ఆరు సంవత్సరాల కాలం నిరుద్యోగిగా వుండిపోయి బంధుబలగంతో 'అసమర్ధపు ప్రతీక'గా ఒక గౌరవ బిరుదును ఉచితంగా పొంది, భుజాలు కుదించుకపోయి నడిచే "పురుషోత్తం", ఇప్పుడు పేరులోనే కాక

'జీవిత సమరం' లో కూడా విజయం సాధించి, "పురుషోత్తమ'' నామధేయం సార్థకపరుచుకున్నాడు. ఒక్కసారి పెర్లిన్ చొక్కా జేబు గట్టిగా పట్టుకున్నాడు. పిన్ చేసిన కొత్త కాగితాలు పెరపెరలాడుతూ అతనికెంతో తుష్టినీ, పుష్టినీ యిచ్చేయి. ఎప్పుడూ నిర్వేదంతో వెనక్కి విరిచి పెట్టుకున్నట్లున్న అతని సిగరెట్టైరుగని సన్నని పెదాలు గర్వంగా, సోగగా, చిన్నినవ్వు నవ్వుతూన్నట్లు అరవిచ్చుకున్నాయి. ఆకాశం వైపు చూసేడు. నోట్ల వాసన రోడ్డుమీద నడిచే ప్రతివారికీ తగుల్తూనే వుంది. "ఏమిటయ్యా పురుషోత్తం? అల్లా నిలబడిపోయేవ్" అంటూ భుజంమీద ఒక్కదరువు వేసి పలకరించేడు సహోద్యోగి మాధవరావు.

"ఆс. ఆс. ఏంలేదు." అంటూ ఆనంద తన్మయావస్థలోంచి లౌకిక ప్రపంచంలోనికి వొచ్చేడు పురుషోత్తం.

"అలా బజారులో పనివుంది. వస్తావేమిటి?" అన్నాడు మాధవరావు.

"నేనూ బజారుకు వెళ్ళాలనుకుంటున్నాను. పద!" అంటూ మాధవరావు వెంట నడిచాడు పురుషోత్తం.

**ముందు వెనుకల ఆలోచన లేనివ్యక్తి సగజీవితం నిరాశలో నిండివున్నా అనుకూలవతి అయిన జీవిత భాగస్వామిని దేవతలా పూజిస్తున్నాడు.... శేషజీవితమయినా బెటర్ హాఫ్ అవుతుందా కపోతం?**

నీలి గగనం నిండా బూడిద రంగు వేషాలు కొత్తగా జీతాలు పుచ్చుకొన్న ఉద్యోగుల్లా, తొందర తొందరగా పరుగులెత్తుతున్నాయి. వాటిని తరుముకొస్తూన్న గయ్యాళి భార్యలాంటి, 'రొజ్జగాలి' కి రోడ్డుమీది చెత్తాచెదారం అయిదారు అడుగుల ఎత్తులో వ్రటువలుగా తిరిగి, మళ్ళీ భూదేవి తప్ప తమకు ఆశ్రయం యిచ్చేదేదీ లేదనుకొని తెలుసుకొని, తిరిగి రోడ్డుమీదకే చేరుతున్నాయి. పురుషోత్తం 'పెర్లిన్ జేబు' లోని కొత్త

"మొదటి నెల జీతం—హుషారు కాబోలు!" అన్నాడు మాధవరావు. ఉత్తముడు ముసిముసిగా నవ్వాడు. అగర్వాలా బట్టల షాపులోనికి దారి తీసేడు పురుషోత్తముడు. ఆరేళ్ళక్రితం యింత దర్జాగానూ ఆ షాపులోనికే నడిచేడు పురుషోత్తం!

మంచి రకాలవీ, చౌక రకాలవీ, మొత్తం వేయి రూపాయిల బట్టలు






కొన్నాడు ఆరోజు ఆ షాపువాళ్ళు ఇతని అడుగులకి మడుగులు ఒత్తారు. రెండు సార్లు గోల్డ్‌స్పాట్‌లు యిచ్చేరు షాపులోని సేల్సుమేన్‌ల్లో యిద్దరు యితని వద్ద చేతులు కట్టుకొని హాజరుగా నించుని, ఇతను ఏ రకం చూపించమంటే ఆ రకం కుప్పలు తెప్పలుగా తెచ్చి, విప్పి, వాటి నాణ్యతను వర్ణిస్తూ వుండిపోయేరు అ పురుషోత్తముడు, నిజం పురుషోత్తముడు లానే కన్యకామణుల తండ్రులకి కన్పించేడు బి కాం రిజల్ట్సు వచ్చిన మొదటి శ్రావణమాసం అది సెకండ్ క్లాసుతో బి కాం పాస్ అయిన పురుషోత్తంని వరించటానికి నేనంటే నేనంటూ పోటీలుపడుతూ పాడిన వేలం పాటలో చివరి పాట రామనాథంగారిదయింది నాలుగువేల అయిదొందల కరుకు రూపాయిలతోపాటు రత్నం లాంటి అనసూయని కూడా పొందగల్గిన అదృష్టవంతుడయినాడు అతని కంటె రెట్టింపు అదృష్టం మూటగట్టుకున్న అనసూయ ఆరేళ్ళలో నలుగురు మగపిల్లలకీ, ఒక ఆడపిల్లకీ, తల్లి అయింది "ధర్మ ప్రజా సంపత్యర్థం స్త్రీయ ముద్వహే" అన్న సంకల్పాన్ని ఆమె నిరాటంకంగా నెరవేర్చింది డిగ్రీ పుచ్చుకున్న పురుషోత్తముడి రీవీ, దర్పమూ దట్టమైన మంచుపొరల్లోంచి, కరిగి, ఉషోదయపు వెలుగు చూడడానికి

రెండేళ్ళు పట్టింది అప్పటికే కవల మగ పిల్లల తండ్రి అయినాడు అప్పటికి. పిలిచి పిల్లనిచ్చినట్లుగానే, పిలిచి ఉద్యోగం యిస్తారనే కమ్మని కల కరిగిపోయింది అప్పట్నించీ తిరిగిన వూరు తిరగకుండా, అప్లికేషన్స్ పెట్టని ఉద్యోగాలూ కంపెనీలూ లేకుండా ప్రయత్నాలు చేస్తూనే వున్నాడు. మరి నాలుగేళ్ళకి కాని ఈ వుద్యోగం దొరకలేదు ఈ వుద్యోగం దొరకగానే తన జీవితం అతి ముఖ్యమయిన మలుపు తిరిగినట్లు అనిపించింది. తన యింటికి నిజమయిన యజమాని యిప్పుడు అయినాడు పురుషోత్తం ఛాతీ గర్వంగా ఉప్పొంగింది ఈసారి అగర్వాల షాపువాళ్లు పురుషోత్తంకు ఎదురు రాలేదు అయినా నిరుత్సాహపడలేదు. అతను [illegible] నడిచాడు మాధవరావు ఏవో [illegible] టి పాప్లిన్ బట్టలు చూస్తున్నాడు [illegible]రుషోత్తంకు ఎదురుగ్గా వున్న షో కేసులోని కనకాంబరం రంగులో జరీ పువ్వులున్న చీర కంటికి నదరుగ కనిపించింది, "ఆ చీర ల్లాంటి వెరైటీ మా [illegible]చవోయ్!" అన్నాడు [illegible] రావు ప్రక్కన వదులుపాంటుతో [illegible] దగ్గర నల్లగా మెరకపట్టిన టెర్లిన్ చొక్కాతో వున్న పురుషోత్తంని ఎగాదిగా చూసేడు సేల్స్‌మేన్. జేబులోని కొత్త కాగితాలు, అ రోజే 'గజ్జెపూజ' చేసిన వేశ్య బాలికలా ముసిముసి నవ్వులతో ఒయ్యారాలు ఒలకపోసేయి. వెంటనే అద్దాల బీరువాల్లో బంధింపబడిన వెంకటగిరి జరీ చీరలన్నీ అతని ముందు కుచ్చెళ్లు విప్పిన విసనకర్రలా పరుచుపడ్డాయి లేత కనకాంబరం రంగు మీద సన్నని జరీ పువ్వులతో చుట్టూ దోసెడు వెడల్పు, ఎరుపురంగు అంచులో బొటన వ్రేలంత వెడల్పు నున్న జరీ చారలతో వున్న చీర ఎంచాడు దాని మీదకు ముదురాకు పచ్చని ధర్మావరం బ్లౌజుపీసూ! చీరా, జాకెట్టు బట్టా కలిపి, ఎనభై ఎనిమిది రూపాయలు అయ్యింది. గర్వంగా బిల్లు కాగితం తీసుకుంటూన్న పురుషోత్తంని, "ఏమిటయ్యోయ్! అంతా అర్ధాంగికే కేటాయించేసేవా!" అన్నాడు మాధవరావు.

"లేదోయ్! పిల్లలకీ తీయాలి పద!" అంటూ ప్రక్కనే వున్న బెంగుళూర్ రెడీమేడ్ షాపులోకి దారితీశాడు పిల్లలు అయిదుగురికీ రెడీమేడ్ బట్టలుకొన్నాడు. నడుస్తోంటే దారిలో మిఠాయి షాపు కనపడింది ఒక కే. జి జిలేబీ తూపించుకుంటూంటే ఎదురుగ్గా బొమ్మల షాపు కనపడింది పురుషోత్తమంకి ఉత్సాహం పుంజుకుంది ఎప్పుడో తన పెద్దకొడుకు పేచీ పెట్టేవాడు చెక్కగుర్రం కొనమని అప్పుడు తను ఉద్యోగస్థుడు కాడు అంచేత ఆ పిల్లలు పాత పౌడరుడబ్బాలతోనూ, ఖాళీ అగ్గిపెట్టెలతోనూ ఆడుకోవలసి వచ్చేది ఇప్పుడు తను ఉద్యోగస్థుడు? తన పిల్లలు రకరకాల ఆట

సామాన్లతో ఆడుకోవాలి! గబగబా ఆ 'టాయ్‌సెంటర్' లోనికి నడిచాడు. ఒక చెక్కగుర్రం, 'కీ' యిస్తే నడిచేరైలు, బుడగలు, అతనికి సరదా వేసిన ప్రతి బొమ్మ కొనేసాడు మాధవరావు ఏదో అనబోయి, అతని సరదాని కాదనటం ఎందుకని వూరుకున్నాడు. ఈ సామాన్లు అన్నీ మోయడానికి వీల్లేక, దారినపోయే టాక్సీ ఆపి మాధవరావుని కూడా ఎక్కమన్నాడు. అతనిదీ పురుషోత్తం యింటి ప్రక్కే అవటంనించి అభ్యంతరం చెప్పకుండా ఎక్కి కూర్చున్నాడు. ఆకాశం నిండా మేఘాలు క్రమ్ముకున్నాయి. టప టప మంటూ చినుకులు కూడా పడటం ప్రారంభించేయి. కారు యింటివద్ద ఆగినప్పుడు అనసూయ వంటింట్లో పిల్లలకి అన్నాలు పెడ్తోంది. కారు హారన్ నాలు గయిదుసార్లు మ్రోగించినా, అనసూయ బైటికి రాలేదు. తను కారులోంచి దిగటం భార్య పిల్లలు చూడనందుకు విసుక్కుంటూ కారులోంచి దిగాడు పురుషోత్తం. డ్రైవరు సామానులు అన్నీ లోపల వరండాలో పెట్టి డబ్బు తీసుకుని వెళ్ళిపోయేడు! వరండాలో లైటు వేసి అక్కడున్న ఈజీఛైర్‌లో జారబడ్డాడు అనసూయ పిల్లలకి చేతులూ, మూతులూ కడిగి చంటిదాన్ని చంకనేసుకుని పమిట చెంగుతో పిల్లదాని మూతీ ముఖమూ తుడుస్తూ వరండాలోకి వొచ్చింది. భర్తని చూసి, "మీరెప్పుడు వొచ్చేరూ? యివన్నీ ఏమిటి? ఇవ్వాళ యింతాలస్యం అయిందే!" అంటూ ప్రశ్నల వర్షం కురిపించసాగింది.

"ఇవ్వాళ మాకు జీతాలు యిచ్చేరు! అంచేతాలస్యం అయ్యింది." అంటూ అనసూయ ప్రశ్నలకి జవాబు చెప్పబోతూండగానె పిల్లలంతా ఆ పేకెట్స్ అన్నీ విప్పదీసి గొడ-గొడవ చేయసాగారు. అన్నల గలభా చూసి అనసూయ చంకలో వున్న చిన్న పాప క్రిందికి జారిపోయి, మగపిల్లల వెళ్ళకడ్డం పడుతూ, వొచ్చీ

---

ఒక పెద్దమనిషితో ఒక మాష్టరుగారు :

'మీ అబ్బాయి అల్లరి రోజు రోజుకీ ఎక్కువై పోతోందండీ!'

'అయితే ప్రక్క పిల్లాడిని కొట్టండి వీడు భయపడతాడు'

'ప్రక్క పిల్లాడు మీ రెండోవాడండీ!'

'ఇటు ప్రక్కవాణ్ణి కొట్టండి.'

'వాడు మా అబ్బాయండీ!'

యం. రాఘవ, ...పురం-2

గాని మాటల్లో తన తాపత్రయాన్ని వ్యక్తం చేయసాగింది పురుషోత్తం. చీర పాకెట్ అందుకుని విప్పి పమిట చెంగు అనసూయ భుజంమీదికి వేస్తూ, "ఈ చీర ఎల్లాగుంది అనసూ!'' అన్నాడు అనసూయ, చీర, జాకెట్ బట్ట చూసి మురిసిపోయింది

''చాలా రోజులయిందండీ! జలతారు చీర కట్టుకోవాలని ఎన్ని రోజుల్నించో మనసుపడుతున్నాను చాలా బాగుంది ఎంతయిందేమిటి?" అంది

''నీకు నచ్చిందా? ఎంతయితేనేంలే! పండగ ఫస్టునాడు అయ్యిందికదూ వాళ్ళ ధర్మమా అంటూ ఇవ్వాళే డబ్బు యిచ్చే సేరు జీతాలు పండగ వెళ్ళేదాకా అంద వేమో అనుకున్నాను " అన్నాడు అనసూయ కేసి కళ్ళనిండుగా చూస్తూ! అనసూయ పెళ్ళికి పచ్చగా బొద్దుగా వుండేది ఇప్పుడు పిల్లల తల్లి అయి సంసార సాధకబాధకాలలో నలిగిపోతూ వున్నా ఆ పసిమిరంగు వసివాడలేదు పైగా బాగా నాజూకు తేరింది పిల్లలంతా బట్టలూ, బొమ్మలూ అన్నీ విప్పేసి, ''ఇది నాది అంటే ఇది నాకు'' అంటూ సంబరాలు పడుతున్నారు, అనసూయ ఆ పాకెట్స్ అన్నీ తీసి పిల్లల్ని కేకలేసి, ''అవి అన్నీ పాడుచేయటానికి కాదు పండుగనాడు యిస్తాలెండి '' అంటూ దాచేసి.

"ఇంక మీరు స్నానం చేసెయ్యండి!" అంది పిల్లలు-బుడగలు మటుకు తీసుకుని, చంటిది తప్పటడుగులు వేస్తూ అందుకోవ టానికి ప్రయత్నించుతుండగా పిల్లలు వాటిని ఇంకా పైకి ఎగరేస్తూ, ఆడించు తున్నారు పురుషోత్తం ఆఫీసు బట్టలు విప్పి తువ్వాలు చుట్టుకుని, 'బాత్‌రూం' లోనికి వెళ్ళేడు అక్కడ 'సోప్ బాక్స్'లో సబ్బు బదులు నలుగు పిండి వుంది. ''సబ్బు అయిపోయింది కాబోలు'' అను కుంటూ పిండి పెట్టి వళ్ళు రుద్దుకుని స్నానం చేసి వొచ్చేడు పిల్లలు కోలాహలంగా బుడగలతో ఆడుకోవటం చూసి "ఇన్నాళ్ళకి కదా! నేను నిజమైన తండ్రి నయ్యేను!" అనుకుంటూ భోజనానికి కూర్చున్నాడు ''కందిగుండ, మెంతి మజ్జిగతో భోజనం కానిచ్చి ఇవతలకు వస్తూ, ''కూరలు ఏమీ లేవు కాబోలు ఇంట్లో '' అనుకున్నాడు. అనసూయ కూడ భోజనం చేసి వంటిల్లు సర్ది ఇవతలకు వచ్చి, భర్తకు ఎదురుగ్గా కూర్చుంది పిల్లలు ఆటల ధోరణిలో వుండటం చూసి మెల్లిగా—

''ఆ జిలేబీ, పొట్లాం దాచేవా? అన్నాడు.

''దాచేలెండి! అవును కానీ ఇన్ని సామాన్లు తెచ్చేరు! మీకు జీతం ఎంతి చ్చేరు?'' అంది.

''ఏం? నూట ఎనభయి రూపాయిలు!'' అన్నాడు ధీమాగా.

''నా చీర ఖరీదెంత?''

''దెబ్బయి ఆరు రూపాయలు. వెంకటగిరి చీర ప్యూర్ వెండి జరీ! జాకెట్టు గుడ్డ పన్నెండు రూపాయలు! నీ వంటి రంగుకి ముదురాకు పచ్చ రంగు బాగుంటుంది కదూ!'' అన్నాడు వుల్లాసంగా

''పిల్లల బట్టలు, బొమ్మలు అన్నీ కొనేసారు! మొత్తం జీతం అంతా ఖర్చు పెట్టేసారా? '' బేలగా అడిగింది అనసూయ

''ఇంక ఐదారు రూపాయలున్నాయిలే! అనసూ! అంతా ఖర్చు పెట్టేసారా అంటున్నావు ఇల్లా నాకు నచ్చినవన్నీ నీ కోసం, పిల్లల కోసం కొనాలని ఆరేళ్ళ బట్టీ కలలు కంటున్నాను నా స్వార్జితంతో ఒక జాకెట్టు గుడ్డయినా నీకు కొని పెట్టి నీ కళ్ళల్లో వెలిగే వెన్నెల కాంతుల్ని తనివిదీరా చూడాలనుకున్నాను 'మా నాన్నగారు కొన్నారు ఈ బొమ్మ' అని పిల్లలు గర్వంగా పొరుగు పిల్లలకి చెప్పి చూపించుతూంటే గర్వంతో పులకించి పోదామనుకున్నాను ఉద్యోగం రాకుండా పెళ్ళి చేసుకున్నందుకు నాలో నేనే కుమిలి పోయేను ఇవ్వాళ నాకెంతో తృప్తిగా వుంది నేను ఈ రోజునించీ నిజమైన భర్తని! నిజమైన తండ్రిని!'' కళ్ళు చెమ్మగిల్లినట్లు తుడుచుకున్నాడు పురుషోత్తం! అనసూయ కిల-కిల నవ్వింది

''భలే వారండీ! సినీమాల్లోలా మాట్లాడటం నేర్చుకున్నారా! నేనెప్పుడయినా

ఏదన్నా కొనమన్నానా? పిల్లలకయితే పరిస్థితులు తెలీవు కనుక ఏదో ఆటసామాన్లు కనీ, తినుబండారాలకనీ పేచీలు పెట్టారు. దానికింత మధనపడి పోయేవారని నాకు తెలీనే తెలీదు."

"ఆదే వచ్చిన చిక్కు! నువ్వు మామూలు భార్యలా అది కొనమనీ, ఇది కొనమనీ వేధించేదానవు కావు! నేను ఈ ఆరేళ్ళ సంసారంలోనూ ఒక్క చీర కొనలేక పోయినా, నీవు వున్న వాటినే పొదుపుగా వాడుకునే దానివి! పిల్లలకి కూడా నీవు పుట్టింటికి వెళ్ళినప్పుడు వాళ్లా వీళ్ళూ ఇచ్చిన బట్టల్నే వాడే దానివి! నీవు మౌనంగా ఈ లేమిని భరిస్తూంటే నాకు భరించలేని దిగులు వేసేది దానితో యింకా కుమిలి పోయే వాడిని! " అన్నాడు.

భర్త ముఖంకేసిచూసింది అనసూయ తనపట్ల అంత ఆత్మీయతతో, అంత రంగిక వ్యధతో నలిగి పోయిన పురుషోత్తం అంటే చెప్పలేనంత జాలి కలిగింది తెల్లవారితే వచ్చే సమస్యలకి ఆమె మనస్సు క్షోభితమయ్యింది. పైకి మటుకు మామూలుగా—

"ప్రొద్దు పోయింది ఇంక లేవండి నిద్ర పోదురు గాని " అంది.

"మరే! చంటిదానితో పాటు నాకు కూడ జోల పాడాలి!" అన్నాడు

"అల్లాగేలెండి!" నవ్వి, పక్క దులిపి దుప్పటి వేసింది

ఇంకా తూరుపున బాగా తెల్లారలేదు. పాలదాని గావుకేకలకి, కలల మేఘాలతో విహరిస్తూ, నిద్ర పోతున్న పురుషోత్తమునికి మెలుకువ కలిగింది

"క్రితం నెలా పదేను రూపాయిలు వుణ్ణిచ్చేసేరు ఈ నెలా నాల్రోజులాగమంటున్నారు. కొత్త గేదకి అడుమాన్ను కట్టాల! మాధవరావు బాబు సెప్పేరు నిన్నటి రోజే జీతాలు ఇచ్చేరనీ! మరి మీరేమో ఇంకా డబ్బియ్య లేనంటున్నారు!" అంటూ గొల్లరాముడు కేక లేస్తోంది

"అబ్బబ్బ! అంతలా అరవకే! బాబు నిద్ర పోతున్నారు నీ కేకలకి చంటిది కూడా లేచి కూచుందంటే నా పని కాదు! ఇన్ని రోజులు ఆగావు ఇంక నాలుగంటే నాలుగే రోజులు ఆగు! నీ డబ్బు పూర్తిగా ఇచ్చేస్తాను," అంది అనసూయ

"అయితే ఎన్నితూర్లు తిప్పుతావమ్మా! ఈ పాలిత్తా, ఈ పాలిత్తా అంటూ ఏడాది పట్టీ తిప్పుతున్నావు నీకాడ డబ్బు వుణ్ణిచ్చుకుంటే నాకేటి నాలం! పిల్లల్ని పెడతాదా!" గంయ్యిమంది రాముడు

మెరుపులా ఒక ఆలోచన వచ్చింది అనసూయకి "వసే! ఓ పని చెయ్యి ఒచ్చే ఫస్టు దాకా ఆగు! నీకు రోజుకి రూపాయికి అణా చొప్పున వడ్డీ యిచ్చేస్తాను." అంది రాముడు మెత్తబడింది

"ఏటో! పెద్దింటి అమ్మవు! అట్టా



బతిమిలాడితే నాకేటి అంటానికి నోరు రాటల్లేదు. సర్లె! పాలు ఎన్ని పోయను? శేరు, చాలతాదా? రెండు శేర్లు కావాలా?'' అంది.

''అర్ధ శేరు చాల్లే! పిల్ల అన్నంలో పడ్డదికా పాలు పోయటం లేదు'' అని, రెండు పావులు పుచ్చుకుని లోపలికి వెళ్ళింది అనసూయ. పురుషోత్తంకి గొల్ల రాముడి మీద పీకదాకా కోపం వచ్చింది. పెద్ద! ఎప్పుడూ డబ్బు ఇయ్యని వాళ్ళల్లా అథారిటీ చేస్తోంది! దాని డబ్బు అణా పైస లతో పారెయ్యాలి! ఉద్రిక్తంగా లేచి, పెరట్లోకి వెళ్ళాడు. నూతి గట్టుమీద కూర్చుని, ''అంటు గిన్నెలు తోముకుం టూన్న అనసూయని చూపి, ''పాల దెందుకే అలా గొంతు చించుకుంటోంది! ఎంతివ్వాలో చెప్పు! దాని బాకీ ముందు పారేసేద్దాం!'' అన్నాడు.

అనసూయ పురుషోత్తం కోపం చూసి మృదువుగా నవ్వింది, ''తర్వాత చెప్తా లెండి! ఇప్పటికి వెళ్ళిందిగా; ముఖం కడుక్కు రండి!'' అంటూ గబ-గబా అంట్ల గిన్నెలు తొలిచి, వంటింట్లోకి పట్టుకు పోయింది. పురుషోత్తం కాఫీ త్రాగి, బయట వరండాలోనికి వచ్చేసరికి ఇంటి యజమాని తాలూకు గుమాస్తా శరభయ్య వొచ్చేడు.

''అప్పుడే వొచ్చేరేమిటండీ! పస్టు సోమవారం అయితేనూ! ..'' విసుక్కు న్నాడు.

"క్రితం నెలా సగం, అద్దె యిచ్చేరు మీరు! ఈ నెల పండగ కదా-మీకు జీతాలు నిన్ననే అందాయిట కదా! పూర్తిగా వసూలు చేయమన్నారు. పిల్లలు గలవారని మీ దగ్గర అడ్వాన్స్ తీసుకోటం లేదు కాని మీరు ఖాళీ చేస్తే, వెయ్యి రూపాయిలు ఎడ్వాన్స్ యిచ్చి దిగుతామని, ఎ-ఇ-లూ, ఇ-ఇ-లూ మా యజమాని ఇంటి చుట్టూ తిరుగుతున్నారు. ఆయన మెత్తబడిపోయి, మీరు ఏ నెల అద్దె ఆ నెల కట్టకపోతే ఖాళీ చేయించెయ్యమని నాతో చెబుతున్నారు. నేనేమో, మీ అవస్థలు చూడలేక అటు ఆయనతో చెప్పలేక నానా యాతనా పడ్తున్నాను" అంటూ "అమ్మడూ, ఏం చేస్తున్నావ్ తల్లీ!" అంటూ లోపలికి ఒక్క కేక వేసాడు.

అనసూయ గ్లాసుతో వేడి కాఫీ తెచ్చి శరభయ్య కిస్తూ, "పిల్లలు కులాసా బాబాయిగారూ!" అంటూ పలకరించింది.

"కులాసాయేనమ్మా!" అంటూ కాఫీ గ్లాసు అందుకున్నాడు.

"ఎంతివ్వాలేమిటండీ!...." అన్నాడు పురుషోత్తం శరభయ్య కాఫీ గ్లాసు వెంపుకసిగా చూస్తూ,

"ఆఁ, ఎంతా! క్రితం నెల పదిహేనూ ఆ క్రితం నెల పదిహేనూ యిచ్చింది. అమ్మడూ! ఈ నెల ముప్పయ్, పాత బాకీ ముప్పయ్ అరవయి రూపాయిలూ యిన్నే యండి! ఒచ్చే నెల నించీ పది రూపాయిలైనా, పెంచకపోతే లాభం లేదు. ఆయన పోరు పడలేక పోతున్నాను. అందరూ, యాభయి 'యిస్తాం, అరవయి యిస్తాం అంటూ ఓలలాడి పోతున్నారు. ఆయనేమో నిప్పు తొక్కిన కోతిలా నా మీద శివా లాడుతున్నాడు. మీకు ఉద్యోగం వచ్చిందికా! ఇంక వచ్చే నెలనించీ నలభై రూపాయిలైనా ఈయకపోతే ఈ భుజాల మీద ఈ బుర్ర వుణ్నివ్వడు రావణాసురుడు!" అన్నాడు శరభయ్య. కాఫీ ఊదుకుంటూ అర్ధగంటా త్రాగి, తృప్తిగా లేచి నించున్నాడు. పురుషోత్తం చిరాకు ఎగిరి పోయింది.

"రెండు రోజుల్లో చెప్తాగా సర్ది పెట్టేస్తా లెండి! అద్దె అయిదు రూపాయిల కన్న ఎక్కువ పెంచలేమండి శరభయ్యగారూ. మీరే ఏదో సర్ది చెప్పాలి. పిల్లలు కలవాణ్ని!" దీనంగా అన్నాడు.

"గుర్రం దిగావా నా తండ్రీ!" అనుకున్నాడు లోపల శరభయ్య. పైకి ఏం సర్ది చెప్పగలనండీ! నన్నిలా ఇరకాటంలో పెట్టేస్తే, నేనెల్లా చావను చెప్పండి!...." అంటూ నసుక్కుంటూ "మళ్ళీ ఎల్లుండి వస్తాలెండి. అప్పటికి రొక్కం జతపరిచి వుంచండి." అంటూ వెళ్ళిపోయేడు. అనసూయ వెనకాలే వంటింట్లోకి వెళ్ళి పీట వాల్చుకు కూర్చున్నాడు.

అనసూయ కుంపటి మీద ఎసరు మురుగుతూన్నా ఇటూ అటూ తచ్చాడుతోంది.

"ఎసరు మరుగుతోంది కదా! బియ్యం కడిగి పొయ్యవేం?" అన్నాడు.

"ఇదుగో చంటిది, చంక కతుక్కు-పోతోంది! కాస్త తీసుక వెళ్ళి ఆడించు దురూ!" అంది దానిని ఎత్తుకుని పీధరుగు మీదకు వెళ్ళి మళ్ళీ ఏమీ తోచక పెరట్లోనికి వచ్చేడు.

"ఇప్పటికే మూడు శేర్లు బియ్యం అప్పు పెట్టాను ఇంక నావల్ల కాదు తల్లీ! మీ ఆయనకు జీతంవొచ్చిందిగా! శుభ్రంగా ఒక అర బస్తా బియ్యం కొని పడేయమని చెప్పు! ఇంట్లో బియ్యం గింజలు వుంటే ఇంత వుడకేసుకుని, ఏ పచ్చడో నాలికకి రాసుకుని మింగచ్చును మొదటికే లేక పోతే ఎల్లాగు? మావి, పాత బియ్యం కూడానూ! పైగా క్రిష్ణకాటుక బియ్యం! నువ్వు కొనిచ్చే బియ్యం, మా యింట్లో ఎవళ్ళూ తినరు ఏ పిండో, మొరుమో పట్టించుకోవాలి మా వారికి తెలిస్తే నన్ను చంపుతారు" అంటోంది పొరుగింటి పిన్నిగారు

"ఇవ్వాల్టికి అప్పు పెడూమరూ, పిన్నిగారూ! నిన్న మా వారికి జీతాలు వొచ్చేసాయి! మధ్యాన్నం సింపీ అన్ని సరుకులూ తెస్తారు మీ బియ్యం లాంటియే మచ్చు చూపించి, తెమ్మంటాను" అంటూ బ్రతిమి లాడుతోంది అనసూయ

"ఎమిటో తల్లీ! పిల్లలు గలదానివి! లేవనటానికి నోరు రాదు!" అంటూ లోపలికి వెళ్ళి బియ్యం తెచ్చి ఇచ్చిందావిడ

చేటలో పోసి చెరిగి, సోలెడు నూకలు

---

ఉద్యోగానికై వొచ్చిన దరఖాస్తుదారుడు మేనేజర్‌ను అడిగాడు మీ కంపెనీలో సంవత్సరానికి 3 నెలలు సెలవ యిస్తారా?"

"ఉహుఁ"

"సంవత్సరానికి 8 నెలలు బోనస్ ఇస్తారా"

"ఉహుఁ"

"నెలకు 20 రూపాయలు ఇంక్రిమెంట్ ఉంటుందా?"

"ఉండదు ఇదంతా ఏ కంపెనీలో ఉన్నది?" అడిగాడు మేనేజర్

"ఇంతకుముందు నేను ఉద్యోగం చేసిన కంపెనీలో ఉన్నది!"

"మరి ఆ ఉద్యోగాన్ని ఎందుకు వొదిలేశావు?"

"నేను వొదల్లేదు, ఆ కంపెనీ దివాళా తీసింది!"

తీసి వేరే పెట్టి మూడు సోలలూ కడిగి ఎసట్లో పోసింది.

''ఇవేనా క్రిష్ణకాటుక బియ్యం ముఖం తెలీనివాళ్ళకిమల్లే చెప్తోంది' కబుర్లు!'' అన్నాడు పురుషోత్తం

"ఏం చేస్తాం? మన అవసరం!'' అంది అనసూయ

భోజనం చేసి ఆఫీసుకి వెళ్ళబోతూ అనసూయని పిల్చి- ''ఇదుగో! నాన్న మనిఆర్డరు పంపితే నీవు తీసుకొని బియ్యం తెచ్చేయి' మిగిలినది పాలబాకీ యింటద్దె తీర్చేద్దాం, లేకపోతే గొల్లదానికి రూపాయికి అణాలు యివ్వాల్సి వుంటుంది, ఈ ఒక్క నెలా కష్టపడితే వొచ్చే నెలనుంచీ ఎల్లానో ఎడ్జస్టు కావొచ్చును '' అన్నాడు.

''అన్నట్టు మర్చిపోయేను. మీనాన్న గారు జాబు వ్రాసేరు ఇవ్వటం మర్చేపోయేను గూట్లోపెట్టాను-చూడండి " అంది అనసూయ "నాన్న ఉత్తరం వ్రాసేరా! ఏమని వ్రాసేరు?''

''ఏమో నేను చదవలేదు!'' అంటూ ప్రక్కగదిలోనికి వెళ్ళింది అనసూయ. పురుషోత్తం ఉత్తరం విప్పిచూచేడు

''చి! పురుషోత్తంను పుత్ర పౌత్రాభి వృద్ధిగా ఆశీర్వదించి వ్రాయునది

నీకు ఈ నెల జీతం అందుతుందని డబ్బు పంపటంలేదు ఏమీ అనుకోకు, నీవు ఇకనుంచీ నెల నెలా యాభయి రూపాయలైనా ఇంటికి పంపవలెను ఈ సంవత్సరం వరదలు వచ్చి, పొలం గింజలు పనికివచ్చేవిగా కనపడటంలేదు చెల్లాయి పెళ్ళికుంచిన రెండు వేలూ నీ ఉద్యోగం నిమిత్తం ''డిపాజిట్టు'' కట్టి నానుకదా! ఇప్పుడు వటారివాళ్లు ముహూర్తం పెట్టామని తొందర చేయుచున్నారు, ఇంట్లో మీ అమ్మ ఈ సంబంధం చేయిజారిపోతే, తిరిగి సంబంధం కుదుర్చుకోవటం అంత సులభం కాదని నన్ను శత పోరుతూ వుంది, నాకు పొలం బాంకులో తణఖా పెట్టుట కంటే వేరు గత్యంతరం కనపడుటలేదు, కారుచీకటిలో కాంతి రేఖలా నీకు ఈ సమయంలో ఉద్యోగం దొరకటం ఒక్కటే నాకు మనశ్శాంతిని స్తోంది, నీవు ఒకటి రెండేళ్ళు కష్టపడితే పొలంమీది అప్పు ఎల్లానో అల్లా తీర్చేయవచ్చును పులిమీద పుట్రలా నా టీచరు వుద్యోగం కూడా విరమించాల్సిన అవసరం వచ్చింది గవర్నమెంటువారు ఈ స్కూలు టీచర్లు ఈ మాత్రంగానయినా కష్టపడటం ఇష్టంలేక, యాభయి ఆయి దేళ్ళకే పదవీ విరమణ చేయాలని రూలు పెట్టారు

"చూసేవా! వాళ్ళకెంత సానుభూతో! మంత్రులు, గవర్నర్స్ డెబ్భయి ఏళ్ళు దాటినా పదవుల్లో వుండొచ్చు! (వాళ్ళు కష్టపడాల్సిన పనేంలేదు కదా అని తెలియటం వల్లనేమో! ఆ పదవులకి ఏజ్

లిమిట్ పట్టలేదు ఉద్యోగాల్లో వున్న ప్పుడు కూడా ఏ నెల జీతం ఆ నెల యిచ్చేస్తే, ఈ ఎలిమెంటరీ బడిపంతుల యిళ్ళల్లో ఖర్చు అయిపోతుందనీ, ముందు చూపుతో వాళ్ళే దాచిపెడుతున్నారు లేక పోతే, వడ్డీలకి అప్పులిచ్చే షావుకార్ల వాణిజ్య మేమయేటట్టు? అటు వాళ్ళ వాణిజ్యమూ పెంపొందాలి' షావుకార్లు లేకపోతే పార్టీలకి విరాళాలు ఎవరు యిస్తారు? మహామేధావులయిన ప్రభుత్వం వారు యివన్నీ సమగ్రంగా పరిశీలించ కుండా వుంటారా? ఏదో నా బాధ కొద్ది యిదంతా వ్రాస్తున్నాను ఏమీ అనుకోకు ఉద్యోగంలో నీ విధులు సక్రమంగా నిర్వర్తించు నా రెక్కల కష్టంతో నిన్ను ఒక డిగ్రీ హోల్డరుగా, చేయగలిగాననేదే నాకు తృప్తి! కోడలును, పిల్లలునూ, అడిగానని చెప్పు వాళ్ళకి నా ఆశీస్సులు 'భూమితణఖా' గురించి ఆలోచించి వెంటనే నీవు వస్తే ఆ వ్యవహారం చూడొచ్చును. చెల్లాయిని ఒకింటిదాన్ని చేస్తే ఇంక నాకు ఏ బాధ్యత ఉండదు నీవు క్లుప్తంగా సంసారం గడుపుకోవాల్సింది

ఇట్లు
నీ తండ్రి
సోమయాజులు

ప్రక్కన అలకిడయితే వెనక్కి తిరిగి చూసేడు అనసూయ నిల్చొని వుంది పొడికళ్ళతో వున్న భర్తని గమనించింది చేతిలో వున్న చీర పాకెట్, చంటిదాని చిన్న గొలుసూ ఇచ్చింది

"ఇవేమిటి? గాభరాగా అన్నాడు

"ఈ చీరా జాకెట్టూ నచ్చలేదు అని చెప్పి యిచ్చేయండి! ఈ గొలుసు నవరసు వుంటుంది అమ్మితే తేలిగ్గా వంద దాకా రావొచ్చును ఈ నెలంతా హాయిగా గడిపేయొచ్చును, గొల్లదానికిఅనవసరంగా రెట్టింపు డబ్బయిపోతుంది!'' పొడిగా అంది అనసూయ.

''ఇంకా నేను అసమర్థుణ్నేనా, అన సూయా।'' తడి కళ్ళతో అన్నాడు పురుషోత్తం

''అల్లా అనుకోకండి! ఈ ఒక్కనెలా ఎల్లాగో గడిచిపోతే వొచ్చే నెలనించీ మనం హాయిగా వుండొచ్చును వొచ్చే నెల నాకు యింతకన్న మంచి చీర తెద్దురు గాని! ముందు మన సంసార నౌక సుడి గుండంలో చిక్కుకుపోకుండా చూడాలి। అదీ ముఖ్యం! చూసేరా నాక్కూడా కవిత్వం ఒచ్చేస్తోంది!'' కిలకిలా నవ్వింది అనసూయ.

''ఎంత తేలిగ్గా నవ్వుతున్నావ్ అన సూయా! నీలా ప్రశాంతంగా ఏం జరిగినా నిష్పూచీగా నేను నవ్వలే నెందుచేత?'' అన్నాడు పురుషోత్తం

"బరువండీ బాబూ! ఆరు జీవాల బాధ్య తల బరువు! నాకేమండీ చింతకాయ పచ్చడి వేసి పెట్టినా నోరు మెదపని భర్త! ముత్యాల్లాంటి పిల్లలు! ఇది చాలదా స్త్రీ జీవితానికి! అంతస్థుకు తగని కోరికలు కోరుకోలేని స్త్రీ ఎప్పుడూ విరిసిన మల్లె పూవులానే ఉంటుంది మీకయితే ఎప్పుడూ మమ్మల్ని యింకా ఏదో సుఖపెట్టలేదని. బాధ పట్టుకుంది. దానితో అల్లాడిగనాసిల్లి పోతూ వుంటారు. నాకేం కష్టం లేదు మొర్రో అన్నా మీరు విన్పించుకోరు! మీరు ఏమీ అనుకోనంటే ఒక్క మాట చెబ్తాను. ఆఫీసరు కారులో వస్తున్నాడే అని ఈర్ష్య పడకండి! జవాను నాలుగు మైళ్ళు నడిచి వస్తున్నాడే అని జాలి పడండి! ఈ జాలి మీ మనస్సులో ఎప్పు డయితే చోటు చేసుకుంటుందో అప్పుడే, మీ ఉద్యోగం, మీ జీతం, మీ జీవితం విలు వలు మీకు అవగతమవుతాయి! ఈర్ష్య, అశాంతికి దోహదమిస్తుంది '' అంది. అక్కడికి తప్పటడుగులు వేస్తూ వచ్చిన చంటిదాన్ని ఎత్తుకుని కితకితలు పెట్టింది. అది బుగ్గలు సొట్టలు పడేలా నవ్వు తూంటే చలాకీగా—

''ఇంక పదండి! అలా నిలుచుండి పోయారేం!'' అంది

"నిజంగా నువ్వు నా 'బెటర్ హాఫ్'వే అనసూ! '' అన్నాడు.

''కవిత్వం రాత్రికి దాచండి '' అంటూ ఉత్సాహంగా నవ్వింది అన సూయ.

పురుషోత్తం కూడా నవ్వుతూ మెట్లు దిగేడు.

*  *  *

---

తండ్రి అతనికేం మూడు డిగ్రీలున్నయ్ అతన్ని చేసుకుంటే సుఖపడతావు
కూతురు డిగ్రీలే ప్రధానమైతే, మనింటో ఉన్న దర్మామీటరుకు పదహారు డిగ్రీ లున్నాయి

# నిర్వచనోత్తర రఘురామాయణం

కె రఘురామం

ప్రకటన — మనిషి ఆలోచనా జ్ఞానాన్ని కొంచెంసేపు ఆపు చేసి ఆ సమయంలో అతనిచేత తన వస్తువు కొనేట్టు చేసేది

బిచ్చగాడు — ఎదుటివారిలో ధర్మగుణం ఇంకా చావలేదని నమ్మకం గల్గిన ఆశావాది.

దేవాలయం — పాపాలు చేసేవాళ్ళ పాలిట ఆసుపత్రి.

దుస్తులు — మనిషే ఒక పాపాల పుట్టయితే దానిని ఇతరులకు కనుపించకుండా దాచే సాధనం.

సర్వపార్టీ సమ్మేళనం . — చూడ్డానికి సర్కస్‌లా కనబడే చదరంగపుటాట.

చావు . — మానవుడు మరీ హఠాత్తుగా తప్పులు చెయ్యడం మానెయ్యడానికి కారణం
లేక
ప్రకృతికి బకాయిబడ్డ బాకీని తీర్చివేయడం

వింత . — — అంతవరకూ రాధలో కనపడ్డ అందాలన్నీ ఆమెతో పెళ్ళయిన మరుక్షణంనుంచీ వాసంతిలో కనబడుతూండటం

క్రూరత్వం . — ఆది మానవునికి ఆనందాన్నిచ్చిన ఏకైక వినోదం (ఈ రోజుల్లోనూ వున్నారు ఆది మానవులు)

ప్రసాదం . . — తీర్థానికి ఘనరూపం.

అవిద్య . :— రాజకీయాలకు సీజన్ టిక్కెట్టు.



చాలామంది 'ఇంటిలెక్చ్యువల్స్ 'కి లాగే నాకు కూడా ఒక జబ్బు ఉంది. అదేమిటంటే ప్రొద్దుటే లేవగానే ఒక చేతిలో కాఫీ ఎంత అవసరమో, రెండో చేతిలో 'న్యూస్ పేపరూ' అంతే అవసరం. అప్పుడే రెండు చేతులూ బేలన్సు' అవుతాయ్ న్యూస్ పేపరు లేకపోతే కాఫీ కంఠం దిగదు. కాఫీ లేకపోతే వార్తలు బుర్రకెక్కవు. అయితే పేపరు చూడ్డం విషయంలో నాలో ఒక ప్రత్యేకత వుంది. మొదట్లో అందరిలాగే నేనూ మొదటి

పేజీలోని హెడ్ లైన్సు చదివేవాణ్ణి. క్రమంగా మొదటిపేజీ నింపివేసే దేశం లోని రాజకీయ వేత్తల 'రాజనీతి' పౌరుల ఘెరావోలు, క్రమశిక్షణారాహిత్యం, మత కల్లోలాలూ, వరదల బీభత్సాలూ, ప్లేన్ క్రాష్‌లో మృతులు, రైళ్ళ ప్రమాదాలూ మొదలైన యింకా ఎన్నో విశేషాలు ప్రకృతి మానవుడికి కల్గించే ఆపదలు, మానవుడే మానవుడికి చేసే ఘోరాలు చూస్తూంటే, రాత్రి నిద్రతో విశ్రాంతి పొంది ప్రశాంతంగా ఉన్న

ఒకరోజున ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో పడ్డ "హౌ మచ్ బెటర్ ఇటీజ్ టు ఎక్వైర్ విజ్డం దాన్ గోల్డ్! (How much better it is to acquire wisdom than gold! ") అన్న బైబిల్ లోని సూక్తిని గురించి థింకిటోవర్ అన్నాడు కదా అని ఆలోచించేను థింకోవర్ చేసేనో ఓవర్ థింక్ చేసేనో చెప్ప లేను కాని, నేను అర్థం చేసుకున్న దేమిటంటే — "మానవుని అమూల్యమైన కాలాన్ని ధనసంపాదన కోసమే పూర్తిగా

---

**ఇల్లు కట్టిచూడు పెళ్ళి చేసిచూడు పాత సామెతకు ఇల్లు మార్చిచూడు స్టాండర్డాఫ్‌లివింగ్ అంతు తేల్చిచూడు అంటే అందులో వున్న స్టాండర్డాప్సాక్ట్ ఎంతవరకు?**

---

మనస్సు వికలమై 'అయ్యో! ఈ సంఘంలో మానవ మనుగడకే భద్రత లోపించి పోయిందే' అని బెంబేలు పడి పోయేవాణ్ణి. ఒక రకమైన మానసిక రుగ్మత ప్రవేశించి నా ఆరోగ్యమే క్షీణించే ప్రమాదం ఉన్నట్టనిపించింది వెంటనే పద్ధతి మార్చేను. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ చేతికందగానే సరాసరి ఎడిటోరియల్ పేజీలో ఉండే 'థింకిటోవర్' అన్న అంశం చూసేవాడిని ప్రపంచం లోని ఎంతోమంది మేధావులు చెప్పిన చక్కని సూక్తులు నన్నెంతగానో ఆకర్షించుకునేవి.

వ్యయం చేసుకునే కంటే, విజ్ఞాన సముపార్జనంకోసం ఖర్చు పెట్టుకుంటే నిజమైన ఆనందాన్ని పొందుతాం అని ఈ సూక్తి నా మనస్సుని బాగా ఆకట్టుకుంది విజ్ఞాన సముపార్జనకి ముఖ్యసాధన మేమై ఉంటుందా అని ఆలోచించేను పుస్తక పఠనానికి మించినది లేదనిపించింది ఇంకప్పటినుంచి కనిపించిన పుస్తకం అల్లా చదవడం ప్రారంభం చేసేను. ఉద్యోగ రీత్యా నేను కాలేజీలో పెద్ద లైబ్రరీకూడా ఉంది కనక యింక పుస్తకాలకి కొదువ లేదు కదా!

అలా పుస్తక పఠన ప్రవాహంలో

పడి కొట్టుకుపోతున్న నేను ఒక రోజున ఒక అమెరికన్ ఇంజనీరింగ్ వ్రాసిన 'ఓన్ యువర్ హౌస్' అనే ఇంగ్లీషు పుస్తక పఠన ప్రారంభంలో కొచ్చి ఆగి పోయేను మొదటి రెండు వాక్యాలే నన్నెంతగానో ఆకర్షించుకున్నాయ్ అవే మిటంటే - ప్రతి వ్యక్తి యొక్క జీవిత కాలం అని రెండు భాగాలుగా విభజిస్తే బయట గడిపిన కాలంకంటే యింట్లో గడిపినకాలం చాలా ఎక్కువ అని 'స్టాటి స్టిక్స్' వల్ల తేలింది ఈ సత్యం గ్రహిం చిన అమెరికన్సు తమ ఆదాయంలో కనీసం నాల్గోవంతైనా ఇంటిమీద ఖర్చు పెడతారుట!

ఇంక నాకు చదువు ముందుకు సాగ లేదు ముందు జరగబోయే విజ్ఞాన సము పార్జన ప్రయత్నానికి తాత్కాలికంగా స్వస్తి చెప్పడం తప్పలేదు ఈ విషయా నికి సంబంధించిన ఆలోచనలతోనే నా మెదడు ఉక్కిరిబిక్కిరి గాసాగింది

మానవుడి విద్యావసరాల్లో 'గృహం' ఎంతో ప్రధానమైనది కదా! అంతటి ప్రాముఖ్యత కల యింటిపై నేను చూపే శ్రద్ధ, పెట్టేఖర్చు ఏపాటివి! ఈ విషయం యిన్నాళ్ళు నా బుర్రకి ఎందుకు తట్టలేదు! ఎంత అశ్రద్ధచేసేను! ఎంత అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నాను!!

ప్రస్తుత ఆర్థిక పరిస్థితిదృష్ట్యా, స్వంత యింటిని గురించి కల గనడంకూడా నా తాహతుకి మించినపని, కాబట్టి ఆ విష యంలో బెంగేలేదు. కాని కనీసం ఉండే అద్దెయిల్లయినా అన్ని విధాలా హంగుగా ఉన్నది చూసుకోవడం నా కర్తవ్యం కాదూ? ఎల్లాగో అల్లా రోజు లెళ్ళిపోతు న్నాయి కదా అని యిన్నాళ్ళు అంత పట్టించుకోలేదు అయినా నా పిచ్చికాని రోజు వెళ్ళకపోతే నా ఒక్కడి గురించీ కాలచక్రం స్తంభించి పోతుందా! తినీ తినక చెట్లక్రింద, రోడ్ల పక్కన 'పేవ్ మెంట్సు' మీద కాపురాలు చేసేవాళ్ళకి, పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం చేస్తూ అంతఃపురాల్లో కులికేవాళ్ళకీకూడా కాలచక్రం సమానమైన వేగంతోటే పరి భ్రమిస్తుంది. కనక ప్రతివ్యక్తీ ఆలో చించుకోవలసిన విషయ మేమిటంటే- రోజు గడుస్తోందా లేదా అని కాదు, ఆ గడిచేరోజు ఏ స్థాయిలో గడుస్తోందీ అని దాన్నే కదా 'స్టాండర్డ్ ఆఫ్ లివింగ్' అంటారు!

నేనంటే పోనీ మొగాణ్ణి కనక. మొగాడు తిరక్క చెడ్డాడు అన్నారు కనక ర్పొజంతా ఎంత తిరిగినా తిండికి, నిద్రకీ యింటికి చేరుకుంటున్నాను, కాని నా అర్ధాంగి మాటేమిటి? 'ఆడది తిరిగిచెడింది' అన్న పాత సామెతమీద యింకా ఎంతో నమ్మకం ఉంచుకుని పొద్దస్తమానమూ యింట్లోనే మగ్గిపోతుందే. ఆమె సుఖం కోసమైనా సదుపాయమైన యిల్లు తీసు కోవడం అవసరం. ఆ యిరుకు గదుల్లో



ఎల్లా కాలక్షేపం చేసిందిన్నాళ్లు, నాకు చాలా ఆశ్చర్య మేసింది. నా శ్రీమతి మీద సానుభూతిముంచుకొచ్చింది ఇంతకీ మా యింట్లో ఉన్న యిబ్బంది లేమిటి? నేను పట్టించుకోవడం మూలంగా యింత క్రితం వరకు నాకు తెలియలేదు. ఈ పుస్తక పఠనానంతరం నాలో అయిన జ్ఞానోదయం (తెలివి తెల్లవారడం) మూలంగా మా యింట్లో అన్నీ లోపల్లాగే కనిపించేయ్. చిన్నచిన్న లోపాలుకూడా భూతద్దాలలో చూపినట్టు చాలా పెద్దవిగా కనిపించ సాగేయ్. గదుల విస్తీర్ణం తగ్గిపోయినట్టనిపించింది ఇంటి పై కప్పు ఎగిరిపోయినట్టే, యిల్లే కంపించినట్లే అనిపించ సాగింది. ప్రకృతి ప్రసాదించే సూర్యరశ్మి, వెలుతురు. గాలి, నీరు కరువైపోయిన ట్టనిపించింది. (ఇంత క్రితం నీరు తప్ప మిగతా వాటి ఆవశ్యకత, ప్రాముఖ్యం మనస్సుకి పట్టనేలేదు,

ఇంటిని గురించి అప్పుడప్పుడు నా శ్రీమతి చేసే కంప్లెయింట్స్ గుర్తుకు రాసాగేయ్ వెంటనే యిల్లు మార్చడం చాలా అవసరం అనిపించింది.

నేను ఇల్లు మార్చాలి అని నిర్ణయిం చుకోడానికి ముఖ్య కారణం-నేను ఇంటికి నా జీతంలో నాల్గోవంతు కాదుకదా పదో వంతు కూడా ఖర్చుపెట్టడం లేదు

ఒక కాలేజీలో లెక్చరర్‌గా ఉంటూ సంఘంలో ఒక స్టేటస్ ఉన్న నేను, నెలకి ఏడు వందల రూపాయలు జీతం తెచ్చుకుంటూ (ప్రైవేట్ల సంగతి యిక్క-డ ఉదహరించడానికి వీలులేదు) యింటికి కేవలం యాభై రూపాయలు మాత్రం అద్దె చెల్లిస్తున్నాను అంటే యింటి విష యంలో నా స్టాండర్డాఫ్ లివింగ్ ఎంత పూర్‌గా ఉందో వేరే చెప్పవలసిన పని లేదు.

శుభ్రమైన-డీసెంటు పోర్షను తీసుకో వలసిన అవసరం ఎంతైనా ఉంది. కనుక ఆ విషయమై ప్రయత్నించడం మొద లెట్టేను అద్దె నూటయాభై రూపాయల దాకా పెట్టదలుచుకున్నాను

* * *

రోజూలాగే ఆ రోజు కూడా కాలేజి స్టాఫ్‌రూమ్ క్లాసులకెళ్లే వాళ్ళతోటి,క్లాసుల నంచొచ్చే వాళ్ళతోటి క్లాస్ వర్కు-లేకుం డా కాలక్షేపం కోసం కబుర్లు చెప్పే వాళ్ళ తోటీ రైల్వే స్టేషన్‌లా చాలా కోలాహ లంగా ఉంది, అంట్ల మనిషి ఎగ్గొట్టడం దగ్గరనుంచి అంతర్జాతీయ రాజకీయాల దాకా చర్చలు కొనసాగుతున్నాయి నేను మాత్రం అవసరమైతేనేగాని వీటి జోలికి పోను నాకు పనికొచ్చే విషయమేమైనా ఉంటే వెంటనే ఉపయోగించుకుంటాను,

మాటల సందర్భంలో లెక్కల డిపా ర్టుమెంటు లక్షణరావు వాళ్ళ యిల్లు ఖాళీ చేస్తున్నట్టు చెప్పేడు ఆ యిల్లు నేనిది వరకు చూసేను ఫ్రంట్ వరండా, డ్రాయింగు రూము, బెడ్ రూమ్, కిచన్, ఎటాచ్‌డ్ బాత్ అండ్ లావెట్రీలతో చాలా డీసెంటుగా ఉంటుంది సెపరేట్ దాబా ఒక ఫామిలీకి చాలా బాగుంటుంది

"ఇల్లు ఎందుకు ఖాళీ చేస్తున్నావు?" అనడిగేను లక్షణరావుని.

"వచ్చిన మొదట్లో అప్పట్లో వేరే యిల్లు దొరక్క- తాత్కా-లికంగా చేరేను కాని అంత అద్దె నేను భరించలేను నా ప్రాణానికి ఒక వైట్‌ఎలిఫెంట్‌లా తయారయింది" అన్నాడు

లక్షణరావుకి నాకంటే కొంచెం జీతం తక్కు-వ,

అదే యిప్పుడు నాకు వరంలా పరిణ మించబోతోంది,!

"మీ యిల్లు ఖాళీ చేస్తే నే నొద్దామను కుంటున్నాను, నాతో చెప్పకుండా మరి ఎవళ్ళకీ యిల్లు పోనీకు" అన్నాను

అద్దె విషయంకూడా అడిగాను అది ముఖ్యం కదా!

"ఇంత వరకు నేను నూట ముప్పై

యిచ్చాను. నేను ఖాళీ చేస్తే నూట యాభై కిమ్మని మా హౌస్ ఓనర్ రాసేడు" అన్నాడు.

నేననుకున్న ప్రకారంగానే వస్తోంది ఎలక్ట్రిసిటీ చార్జస్ కలిపినా నా జీతంలో నాల్గోవంతుకంటే ఎక్కువకాదె.

ఒక్కక్షణం అమెరికన్స్‌తో సమానమైన స్టాండర్డ్ ఆఫ్ లివింగ్ ఉన్నట్టనిపించి నా మనస్సు గర్వంతో తొణికిసలాడింది.

ఈ శుభ సమయంలో నా మనస్సులోని ఆనందంలో పాలు పంచుకునే నా అర్ధాంగి లేనందుకు ఎంతో విచారించేను. ఆవిడగారు ప్రస్తుతం మా ఇంట్లోవున్న ఇరుకు చాలదన్నట్లు ఇంకా ఇరుకు చేయడం కోసం పుట్టింటి కెళ్ళింది

తిధి, వారం, వర్జ్యం, తార, శూల అన్నీ చూపించుకుని ఒక శుభముహూర్తాన నే నొక్కడినీ వెళ్ళి కొత్త యింటిలో ప్రవేశించేను అయితే పాతయిల్లు వదిలేటప్పుడు మాత్రం చాలా కష్టంగానే తోచింది ఆ యింటి యజమాని వెంకట్రామయ్యగారు ఆయన సతీమణి మాణిక్యమ్మగారు యింత కాలం సొమ్మల్ని కన్న బిడ్డలకి మళ్ళీనే చూసేరు. వాళ్ళలో ఎంత ఆత్మీయత ఉన్నా, ఇంటిలో హంగు తక్కువగా ఉండడం మూలంగా నేను మరి యిల్లు మారక తప్పదుకదా! తల్లి దండ్రులని విడిచి అత్తవారింటి కెళ్ళే కుమార్తెలా, ఉద్యోగానికి దూరదేశాలకి వెళ్ళే కుమారుడిలా ఆ యిల్లు వదలి వెళ్లేనే కాని, వాళ్ళ మీద యుద్ధం ప్రకటించి మాత్రం కాదు.

కొత్త యిల్లు ఎంత నదుపాయంగా ఉన్నా, నే నొక్కడినీ ఉంటూండడం మూలంగానూ, నాకు బిక్కు బిక్కుమంటూ ఉండేది.

ఆ యింట్లో కొత్తగా నాకు కలిగిన, కలగబోయే హంగుల గురించి రంగు రంగుల కలలతో ఊహాగానాలు చేసుకుంటూ కాలక్షేపం చెయ్యడం మొదలెట్టేను.

కొత్త యింటిలో ముఖ్యంగా నేను చెప్పుకుని సంతోషించదగ్గ సుగుణాలు రెండున్నాయి

ఒకటి- పడకగది మిగతా గదులకి సంబంధం లేకుండా ఒక ప్రక్కగా ఉంది

---

జడ్జి నువ్వు నీ భర్త దగ్గరనుండి విడాకులెందుకోరుతున్నావ్?
ముద్దాయి (భార్య) నా భర్త తను వ్రాసిన చెత్త కథలన్నీ చదివి వినిపిస్తుంటే వినలేక చస్తున్నా!

—పి. యస్. ప్రకాశరావు, బరంపురం-2

దాని వల్ల అంత చెప్పుకో తగ్గ సుఖం ఉందా అని మీరనుకోవచ్చు డ్రాయింగ్ రూమ్, బెడ్ రూమ్, కిచన్ ఈ మూడూ ఒకే లైనులో ఉంది. ప్రక్కన సందు కూడా లేకుండా ఉన్నవాటాలో ఉండే వాళ్ళకే అందులో సుఖం అర్థమౌతుంది నేను యిది వరకు ఉన్న పోర్షన్ అటు వంటిదే. పడకగది త్రిశంకు స్వర్గంలా మయంగా ఉండిపోతుంది మా యిల్లు వచ్చీపోయే అతిథులకి ఎప్పుడూ నిలయం గానే ఉండేది డ్రాయింగ్ రూమ్‌లో రాత్రిళ్ళు పడుకున్న అతిథులు ఒక రాత్రి వేళ ఏ అవసరమైనా వచ్చి దొడ్డిలోకి వెళ్లాలంటే పడక గదిగుండా వెళ్లాల్సిందే కదా! అవసరమైన వాళ్ళు నిర్మొహ మాటంగా లేపితే మేము యిబ్బంది పడే వాళ్ళం 'మమ్మల్ని యిబ్బంది పెట్టడం ఎందుకులే' అని వాళ్ళు మొహమాట పడితే వాళ్ళు ఇబ్బంది పడే వారు అలా వారు ఇబ్బంది పడిన విషయం మాకు తెలిస్తే 'అయ్యో! మన అతిథులకి యిబ్బంది కలిగిందే!' అని మళ్ళీ మేమే మనసులో బాధపడే వాళ్ళం. ఇప్పుడీ కొత్తయింట్లో అలాంటి బాధలుండవు.

నేను ముఖ్యంగా. వ్యక్తిగతంగా సం తోషించే మరొక విషయ మేమిటంటే - ప్రైవసీ

పాత యింట్లో మా వాటాలో ఉండే గదుల్లోంచి యింటివాళ్ళ గదుల్లోకి గోడ ల్లోకి తలుపు లుండేవి.

ఆ తలుపులెప్పుడూ మూసేవున్నా వాటి వల్ల యిబ్బందులు మాత్రం తెరుచుకునే ఉండేవి.

రెండు తలుపు రెక్కల మధ్య నిటా రుగా సందు చిన్నదిగా ఉంటే ఉండి ఉండవచ్చు. నేనంతగా పరిశీలించ లేదు కాని, లేదనే అనుకుంటున్నాను.

కాంతి కిరణాలు తిన్నగానే ప్రసారం చేస్తాయి కనుక, దృష్టిరీత్యా ఆ తలు పుల వల్ల అంత ప్రమాదం లేకపోవచ్చు వచ్చిన చిక్కల్లా శబ్ద తరంగాల తోనే 'కాన్స్టిట్యూషన్'ని కూడా లెక్క చెయ్యని నియంతలా వాటి ప్రయా నికో రూలూ, రైమూ లేదు.

మా పడకగదిలో సూది కింద పడితే అవతల గదిలోకి వినిపిస్తుంది.

దాంతో, పడక గదిలో ఉన్నంతసేపూ మౌనమే శరణ్యమయ్యేది శారీరక-మాన సిక ఆరోగ్యాలకి మౌనం ఎంత మంచి ఔషధమైనా, కష్టసుఖాలు కాస్సేపు చెప్పు కునే పడక గదిలోనే అవలంబించాలంటే ఎంతకైనా కష్టంగానే ఉంటుంది కదా!

ఈ కొత్త యింట్లో ఆ బాధ లేదు. రాత్రి తెల్లవార్లూ ఎంతగా మాట్లాడుకున్నా, పోట్లాడుకున్నా ఎవరికి వినిపించదు మన యింట్లో వాళ్ళకి తప్ప

ఈ రెండు హంగులువల్ల నాలో కల్గిన

రెట్టించిన ఉత్సాహంతో శ్రీమతి రాక కోసం ఎదురు చూస్తున్నాను.

తీరా ఆ శుభ ఘడియలు వచ్చిన తరువాత — నా శ్రీమతికి నచ్చినట్టు లేదు కొత్తగా కట్టించిన బిల్డింగ్ ఇన్స్పెక్షన్‌కి "ఛీఫ్ ఇంజనీర్" వచ్చినట్టుంది తనకి అనుకూలంగా ప్రవర్తించని 'సబార్డినేట్'లో ఏదో లోపాలు వెతకడమే ముఖ్యంగా భావించే ఆఫీసర్‌లా, బిల్లుని కనీసం చూడనైనా చూడకుండా 'ది బిల్ ఈజ్ రిటర్న్డ్ విత్ ది ఫాలోయింగ్ రిమార్క్స్' (The bill is returned with the following remarks) అని మొదటే ప్రారంభించి బిల్లులో లోపాలు వెతికే ఎక్కౌంటెంట్‌లా ఇంటిలోకి యింకా పూర్తిగా ప్రవేశించకుండానే నా శ్రీమతి యింటిలో లోపాలు ఏకరువు పెట్టడం ప్రారంభించింది.

శ్రీకృష్ణుడిలో లోపాలు చూపెట్టే శిశుపాలుడిలా, నేను కోరి కొత్తగా ప్రవేశించిన నా నూతన గృహంలోని లోపాల దండకం చదవడం మొదలెట్టింది అవన్నీ యిక్కడ ముచ్చటించుకోవడం ప్రారంభిస్తే, ఒక పెద్ద సీరియల్ అయ్యే ప్రమాదముంది కనక అందులోని ఆణి ముత్యాలు మాత్రం కొన్ని ఉదహరించుకుందాం.

ఇల్లు ఎక్కడో అడివిలో విసిరి కొట్టినట్టుంది. ఘడియలూ, బోల్టులూ లేవుట (అసలు లేకపోలేదు. గట్టి లేవు కనక ఉన్నట్టు కాదుట) ఇంటికి మూడువైపుల మాత్రమే కాంపౌండ్ వాల్స్ ఉన్నాయిట. (నల్లరేగడి నేలలో అసలు 'కాంపౌండ్ వాల్సు' అంటూ కట్టడానికి యజమాని సాహసించినందుకు సంతోషిస్తున్నాను!)

నాలుగోవైపు గోడలేని కారణంగా దొడ్లో పందులు, కుక్కలు, కోళ్ల మొదలుగాగల సమస్త జంతు జాలము స్వైర విహారము చేస్తాయిట (దురదృష్టవశాత్తు అప్పటికి వాస్తవంగా చేస్తున్నాయి). అమ్మవారి సింహాసనం పెటుకుందుకు

ప్రత్యేకంగా ఒక గూడు లేదుట.. ముఖ్యంగా శివుడి స్థానమైన ఈశాన్యమూల లెట్రిన్ ఉందిట. (ఈ వాస్తు శాస్త్ర పరిజ్ఞానం నాకు ఇసుమంతకూడా లేకపోవడం గొప్ప చిక్కే తెచ్చిపెట్టింది)

ఇంకా ఎన్నో లోపాలు ఏకరువు పెట్టుకుంటూ పోయి, ఇంత కంటే చచ్చు కొంప ఈ ఊళ్ళో మీకు దొరకనే లేదా? అసలు నాకు చెప్పా పెట్టాకుండా యిల్లెవరు మార్చమన్నారు తగుదునమ్మా అని?" అన్న క్వొశ్చన్ మార్కుతో తన భావోద్వేగానికి ఫుల్‌స్టాప్ పెట్టింది మొదట్లో నిందాస్తుతి కాబోలు అనుకున్నా కాని, నిజంగా నిందే అని తేలిన తరువాత, ఎవరి సుఖం కోసం నేనింత కష్టపడి, ఎక్కువ అద్దె భరించడానికి ఇష్టపడి యిల్లు మార్చేనో, ఆ వ్యక్తి నోటంట వచ్చిన మాటలు వినగానే నేను నిలువునా నీరుగారి పోయేను తన పుట్టిన రోజు పండుగకి నేను బహుమతిగా తీసికెళ్ళే కంచి పట్టు చీరలూ, నెక్లెస్‌లూ నచ్చలేదని నా ముఖాన కొట్టినా, నుదుటి మీద చిన్న బొప్పి కట్టేదేమో కాని, ఇప్పుడు నా మనస్సులో కలిగిన గాయం చెప్పరానిది వర్ణించడానికి అలవి కానిది

అనుకోకుండగా నా శ్రీమతివల్ల నాకు కలిగిన అవమానాన్ని, 'రియలిస్టిక్ వ్యూ' అర్థం చేసుకోడానికి ప్రయత్నించేను ఆమె నా అర్ధాంగి సహధర్మ చారిణి అందునా సమాన హక్కుల కోసం స్త్రీలు పోరాడి సాధించుకుంటున్న ఈ రోజుల్లో పురుషుడివల్ల స్త్రీకి ఎట్టి అన్యాయం జరగడానికి వీల్లేదు ఆలు-మగల దాంపత్య జీవితానికి ఇరువురూ కలిసే ఎన్నో (వీలైతే అన్నీ) 'డెసిషన్సు' తీసుకుంటారు అల్లాంటిది ముఖ్యమైన ఇంటి విషయంలో నా శ్రీమతి అంగీకారం ముందుగా పొందక పోవడం నా పొరపాటేననీ, అందుకు నా శ్రీమతి దృష్టిలో నేను క్షంతవ్యుణ్ణి కాననీ అర్థం చేసుకున్నాను.

ఆలు మగల మధ్య అభిప్రాయ భేదాలుండడం సహజం కనుక యింటి విషయంలో నా శ్రీమతికి నచ్చకపోవడంలో ఆశ్చర్యం లేదు

ఆమె దృష్టిలో వెలయాలికి పెట్టిన సొమ్మెంత నష్టమో, గోడకుకొట్టిన వెల్ల కూడా అంతేనని అలాంటప్పుడు కేవలం ఇంటి అద్దిమీద నెలకి నూట యాభై వెచ్చించడం ఆమెకు సుతరామూ ఇష్టం లేదు సంవత్సరం అద్దిపెడితే పన్నెండు కాసుల బంగారంతో ఏ వరహాల పేరో పలక సరులో, ఇంకా ఏవో ఏవో నగలు చేయించుకుని ఒంటి కెట్టుకోవచ్చును కదా అని ఊహ.

ఒంటికి పెట్టుకుంటే, ఆ బరువు మొయ్యడంలో ఆనందం పొందేది తను ఒకర్తే ననీ, ఇంటి కెట్టుకుంటూ ఆసుఖం అందరూ పొందవచ్చుననీ, నే నెంత నచ్చ చెప్పడానికి ప్రయత్నించినా,




బంగారం విషయంలో నిర్దుష్టమైన అభిప్రాయాలతో కూడిన ఆమె వ్యక్తిత్వాన్ని నా వైపు ఎంత మాత్రమూ తిప్పుకోలేక పోయేను.

తల్లిదండ్రులకంటే ఎక్కువగా చూసుకునే మా పాత యజమానులైన వెంకట్రామయ్య దంపతుల్ని విడిచి ఒంటరిగా యీ కొత్తయింట్లోకి రావడం ముఖ్యంగా అన్నింటికంటె ఆమెకి ఎక్కువ కష్టం కలిగించింది. ఆ విషయంలో కూడా ఏదోలా అనునయించడానికి ప్రయత్నం చేసేను.

ఏడుస్తూ వ్యవసాయంచేస్తే కాడి,ఎడ్లు దొంగల పరమైనట్టు, ఈ కొత్త ఇంట్లో ఈదురోమని కాపురం ప్రారంభించిన నా శ్రీమతికి ముఖ్యంగా అవసరమయ్యే పని మనిషి దొరకలేదు. అంట్లు తోమడానికి ఆ చుట్టుపట్ల ఎంతమంది నడిగినా 'తలకి మించిన బరువు మోస్తున్నాం' అనేవాళ్లే.

గాంధిమార్గమైన 'బేసిక్ ట్రెయినింగ్' అయినా కనీసం పొందకపోవడంవల్ల, 'పాత్ర ప్రక్షాళన' తెచ్చిపెట్టిన శిక్షవల్ల ఆమె పరిస్థితి పిచ్చెక్కిన కోతికి ముల్లు గుచ్చుకున్నట్టయింది.

ఎటువంటి కట్టడమైనా, దాని బరువు పునాదులద్వారా చివరికి భూమాతకే ఏ విధంగా తప్పనిసరిగా సంక్రమిస్తుందో అదేవిధంగా, శ్రీమతి చికాకులు, కోపం, ఉక్రోషం మొత్తనం పిల్లల నడ్డిమీదకి నేల టపాకాయల రూపంలో వినేవాళ్ళ వీనులకి విందు చేసేవి.

దైవ స్వరూపులైన పసిపిల్లలికి జరిగే అన్యాయం చూసి సహించలేక పిల్లల ఒంటిమీద చెయ్యివెయ్యడానికి వీలులేదని గట్టిగా శాసించేను.

దానితో ఆ విసురంతా నా మీదకి మళ్ళించింది. ఎంతకైనా హైందవ స్త్రీ కనుక, భర్తనైన నన్ను చెయ్యి చేసుకో లేదు కనుక తన అక్కసంతా నోటి ద్వారా వెళ్ళ గ్రక్కేది

గతుకుల రోడ్లమీద సాఫీగా పోవా లంటే కారుకి అవసరమైన స్ప్రింగ్ లాగా మా సంసారం ఈ గతుకుల పరి స్థితుల్లో సాఫీగా సాగి పోవడం కోసం నేను ఒక స్ప్రింగ్ కావలసి వచ్చింది.

"ఎంతో మంచివాళ్ళు. సందడైన వాళ్ళు, కలివిడైన వాళ్ళనీ విడిచి మూల తోరుకొట్టి చస్తున్నాను. ఇంటికి తాళం వేసి ఎక్కడికైనా వెడదామంటే వీలు లేదు. ఈ ప్రాంతంలో దొంగతనా లెక్కువంటున్నారు. వచ్చే నెల్లో మా చెల్లెలి పెళ్ళి కెళ్ళాలి కూడాను. ఎలాగో ఏమిటో." అంటూ బాధపడేది.

మా కొత్త యిల్లు చుడ్డానికొచ్చే బంధు వర్గంలోని ఆడంగులు "యిల్లు మాత్రం చూడ్డానికి చాలా బాగుంది కాని ఒక్క రిత్తీ ఉండాలంటే భయం కాదుటే? మీ ఆయన ఏ ఊరేనా వెడితే పిల్లలతో నువ్వొక్కత్తివీ ప్రాణాలు గుప్పిట్లో పెట్టు కూర్చోవాలి" అంటూ పిరికి మందులు నూరిపోసి మరీపోయేవారు.

పిరి అబ్బకపోయినా చీర అబ్బు తుందట. శ్రేయోభిలాషుల నోటంట వచ్చే మంచి మాట జరగక పోయినా చెడ్డమాటకి మాత్రం తథాస్తు! అంటారు కాబోలు ఆ తరుణంకోసం వేచికూర్చొనే తథాస్తు దేవతలు.

ఒక రోజున జరీ అంచు కొత్త చీర దొడ్లో తీగమీద ఆరబెట్టి వంటింట్లో పని చూచుకుని. ఒక అరగంట పోయిన తర వాత వచ్చి ఆ అరగంట కాలంతోపాటు దొడ్లో చీర కూడా పోయిందని గ్రహిం చింది నా శ్రీమతి.

ఆమెను ఒక ఒంటెతో పోలిస్తే, ఈ సంఘటనని 'లాస్ట్ స్ట్రా ఆన్ ది కేమెల్స్ బ్యాక్' అని చెప్పొచ్చు.

ఈ దెబ్బతో దొంగల భయం ఆమె మనస్సులోని ధైర్యాన్ని పూర్తిగా దొంగి లించేసింది. "వెంటనే యిల్లు మార్చె

---

భర్త: చూడు, బాబు ఏడుస్తున్నాడు. కాస్త ఊరడించి పడుకోబెట్టు.
భార్య: బాబు ఏడ్వవలసిన అవసరం లేదండీ. నేను పాడుతున్నాను.

—పి. యస్. ప్రకాశరావు, బరంపురం-2.

య్యేంది'' అని అల్టిమేటమ్ కూడా యిచ్చింది.

ఎక్కడో ఒకచోట ప్రశాంతంగా కాలక్షేపం అయిపోతుంటే 'స్టాండర్డాఫ్ లివింగ్' అంటూ ఒక కొత్త సమస్యని సృష్టించుకుని కొరివితో తలగోక్కున్నా నేమిటా అనిపించసాగింది నాకు.

రోజూ రెండుపూట్లా 'అంట్లు' ముం దేసుకుని కూర్చున్న నా అర్ధాంగిని చూస్తోంటే ''ఇదేనా నే నిక్కడి కొచ్చి బావుకున్న స్టాండర్డాఫ్ లివింగ్!' అని పించేది. నా మనస్సు ఎంతగానో క్షోభిం చేది.

మాన్యువల్ లేబర్ కరువైన కొలదీ, అది దేశాభ్యుదయ చిహ్నమేనని అందుకు విచారించకూడదనీ, జీవనప్రమాణం పెరి గిందని గర్వపడాలనీ క్లాసులో లెక్చర్ అంటే యిచ్చేను. కాని, దాని విషయం నాదాకా వస్తే నే కాని తెలియలేదు. పని మనిషి లేక ఎంతైనా యిబ్బంది పడు తున్నాం.

''ఇల్లు మార్చవలసిందే'' నని శాంత ఎంత అల్టిమేటమ్ ఇచ్చినా, నా మనస్సుకి నాకు యింకా యిష్టం లేదు.

పరిస్థితులు చక్కబడకపోతాయా! పని మనిషి దొరక్క పోతుందా! ఇంటికి మైనర్ రిపెయిర్స్ చేయించక పోతామా! (ఈ విషయమై ఓనర్‌కి ఉత్తరంకూడా రాసేను.)

నాలో ఎక్కడో ఆశాకిరణం మినుకు మినుకు మంటోంది. ఎంతకైనా మాన వుడు ఆశాజీవి కదా!

ఒకరోజు సాయంకాలం భోజనానం తరం. బజారు కెడదామని ఫ్రంట్ యార్డులో తాళమేసి ఉన్న సైకిలు దగ్గరి కొచ్చిచూస్తే డైనమో బల్బ్, బెల్‌కి ఉండే స్టెయిన్‌లెస్ స్టీల్ కప్పు లేవు!

భార్యాభర్తల మధ్య రహస్యా లుండ కూడదని వివాహ సమయంలో అగ్ని సాక్షిగా చేసిన ప్రమాణం గుర్తున్నా. ఈ దొంగతనం గురించి చెబితే, ఆమె ప్రస్తుత పరిస్థితుల్లో వేసే అక్షింతలభారం

మోసేశక్తి లేక చెప్పలేదు.

నేనెంత స్ప్రింగులా ఉందామని ప్రయత్నించినా, ఆ స్ప్రింగుకు కూడా కొంతకాలానికి 'ఎలాస్టిసిటీ' పోతుంది కదా! ఇప్పుడు నా పరిస్థితీ అలాగే ఉంది.

నా స్వానుభవం నా శ్రీమతిచ్చిన అల్టిమేటమ్ గురించి నేను సీరియస్‌గా ఆలోచించేట్టు చేసింది.

'స్వర్గసీమ' అని భ్రమపడి ఈ ఇంట్లోకి వస్తే, అది 'నరకరూపం'లా తయారయే ప్రమాదం కనిపించడంతో, ఇంక లాభం లేదని ఇల్లు మార్చెయ్యడానికి కంకణం కట్టుకున్నాను.

ఇంత కాలానికి నాలో మళ్ళీ ఒక సత్సంకల్పం కలిగినందుకు నా శ్రీమతి లాటరీలో లక్షరూపాయలు వచ్చినంతగా సంతోషించింది.

రోజూ సాయంకాలం కాలేజీ అవగానే ఇళ్ళవేటలో పడ్డాను "కొత్త యిల్లు మూడునాళ్ళ ముచ్చటేనా??" అని కొందరు నా మిత్రులు ధైర్యం ఉన్నవాళ్ళు ప్రత్యక్షంగా, ధైర్యం లేనివాళ్లు పరోక్షంగానూ నన్ను హేళన చెయ్యడం కూడా మొదలెట్టేరు. కాని కార్య దక్షుడనైన నేను అవేమీ లక్ష్యపెట్టక అకుంఠిత దీక్షతో నా కార్యక్రమం కొనసాగిస్తున్నాను.

ఊళ్లో సందులు, గొందులు, కిళ్ళీ బడ్డీలు, హేయిర్‌కటింగ్ సెలూన్లు, లాండ్రీలు, మొదలైన వాటిపేర్లు నాకు బాగా నలుగుతున్నాయి. కాళ్ళు సాగుతున్నాయి. జోళ్ళు అరుగుతున్నాయి, ఊళ్లో ఆ బాల గోపాలంతో పరిచయాలు కలుగుతున్నాయి గంటలు, రోజులు, వారాలు, నెలలూ కూడా జరుగుతున్నాయి. నా ఒంట్లో జవ సత్తువలు ఉడుగుతున్నాయి కాని, నాకు నచ్చిన యిల్లుమాత్రం దొరకడంలేదు. నాకు, నా శ్రీమతికీ కూడా నచ్చేయిల్లు అసలు దొరకడంలేదు.

నేను యింటికోసం తిరిగిన తిరుగుడులో ఏ తండ్రి అయినా తన కుంటి కుమార్తెకి కూడా పెళ్ళికొడుకుని వెతికి ఉండకలిగేవాడు. పోనీ ఆ పనైనా కలిసొస్తుందేమో అంటే యింకా నా పిల్లలు (కుంటి అనుకునేరు! రత్నాల్లా ఉంటారు) పెళ్ళికి ఎదగాలేదు, అందుకు కావలసిన సొమ్ము నేనింకా కూడబెట్టాలేదు. అయినా, ఎదిగేక నా పిల్లలు పెళ్ళి చేసుకుంటారో, లేదో తెలియదు. అసలప్పటికి పెళ్ళిళ్ళనేవి ఉంటాయో ఉండవో తెలియదు. కనక ఎప్పటి విషయాన్ని గురించో యిప్పుడు కలిపి రాలేదనుకోడం అవివేకం.

నూతన గృహాన్వేషణలో నిమగ్నుడనై ఉన్న నాకు తెలియకుండానే రెండు నెలలు గడిచేయి. నా కృషిమాత్రం శుక్ల పక్షం వెన్నెలలా, జూదంలో ఓడిపోయే వాడి పట్టుదలలా దినదినాభివృద్ధి చెందు




తోందేకాని ఎంత మాత్రం లోపం జరగడంలేదు

ఈ రెండు నెల్లలోనూ నా శ్రీమతి పరిస్థితిలో కొంత మార్పు రాసాగింది. ముఖ్యంగా చెప్పుకోతగ్గవి రెండు. మొదటిది పనిమనిషి కుదరడం అసలు జీవితమే ఒకజూదం ఒకళ్ళకి కలిగిననష్టమే మరొకరికి సుఖం

మా పక్కింటి కాంతమ్మగారి పనిమనిషి యొక్క అప్పగారైన అప్పలమ్మ భర్త లారీ ప్రమాదంలో మరణించగా, అప్పలమ్మకి నిలువ నీడలేక స్వగ్రామం వదలి చెల్లెలి యింటికి ఆశ్రయించి వచ్చింది. రెక్కాడితేనే కాని డొక్కాడే విధానం లేదు కనుక మా యింట్లో పనిమనిషిగా కుదిర్చింది ఆచెల్లెలు. ఆ విధంగా అప్పలమ్మపాలిట శాపం నా శ్రీమతి పాలిట వరంలా పరిణమించింది.

రెండో విషయమేమిటంటే మాదొడ్లో నాలుగో పక్క గోడ వెలిసింది మా పక్కింటివాళ్ళబ్బాయి పి డబ్ల్యు డి లో సూపరువైజరు అనుకోకుండా పది, పదిహేను బస్తాల సిమెంటు కలిసొస్తే ఎప్పటికైనా వాళ్లు పెట్టుకోవలసిన గోడేకదా అని గోడ కట్టించేరు మృగ, ఖగ సంచారానికి అంతరాయం కలగడంతో దొడ్డి బాగుచేయించి కిచన్‌గార్డెన్ కూడా తయారు చేసుకున్నాం.

మా యింటికి మరొకప్రక్కన ఉన్న రైతులగేదె ఈనడం మూలంగా వాళ్లు మాకు మట్టి ఊడల్లాంటి చిక్కని పాలు స్నేహధర్మంగా పోయడం ప్రారంభించేరు.

ఎదురుగా ఉన్న శాస్త్రిగారి చెల్లెలుతోటి

ఆ పక్కనే ఈ మధ్యనే దిగిన అరవవాళ్ళ 'మామి'గారితోటీ నా శ్రీమతికి స్నేహం కలిసింది మాటల సందర్భంలో'' అన్నయ్యగారు ఊళ్లోలేకపోతే మీరేమీ భయపడనక్కరలేదు నేనొచ్చి మీకు సాయం పడుక్కుంటాను లెండి'' అంకిట శాస్త్రి గారి చెల్లెలు

కొత్తగా వచ్చిన అరవావిడకూడా "మామీః మామీః" అంటూ అస్తమానం నా శ్రీమతి దగ్గరే ఉంటుంది ఆవిడకి తెలుగు కొత్త. మేము కొంతకాలం ఉద్యోగరీత్యా మద్రాసులో కాపురం వెలగబెట్టడం మూలంగా నా శ్రీమతి కూడా వచ్చీరాని తమిళం మాట్లాడుతుంది, ఆ మిడి భాషాజ్ఞానమే ఈ మామీలిద్దరి మధ్యా అనుబంధం ఏర్పరిచింది

మరొక విషయమేమిటంటే మా కాలేజీలో పెద్ద లైబ్రరీ ఉందికదా అని నా జ్ఞాన తృష్ణలో ఎన్నో కొత్తపుస్తకాలు తెచ్చి ఇంట్లో ఒక చిన్నసైజు లైబ్రరీ నేను నెలకొల్పితే, నా శ్రీమతి దాన్ని ఒక మొబైల్ లైబ్రరీగా మార్చి ఆ వీధిలో అందరికీ పుస్తకాలు సప్లై చేసి, సర్క్యులేట్‌చేసి ఆ వీధి మహిళా మండలిలో ఒక ఆప్తురాలిగా (వి ఐ. పిగా) తయారై పోయింది

అనుకోకుండా అనుకూలంగా జరిగిన ఈ 'గాలి' మార్పుడికి నా శ్రీమతికి మొదట్లో పరమ చచ్చు కొంపగా కనిపించిన మా కొత్త గొప్ప భవంతిలా కన్పించడం ప్రారంభించింది,

ఆమెలోని ఈ పరివర్తన గమనించక మామూలు ధోరణిలోనే కొంపలకోసం దుంపతెంపుకుంటున్న నన్నుద్దేశించి, ఒక శుభసమయాన మాయింటి గుణగణాలన్నీ స్తుతించి, అట్టి ఇంద్రభవనం సంపాదించిన నా తెలివితేటలను మెచ్చుకుని "ఇంక ఇళ్ళప్రయత్నం విరమించుకోండి'' అవి ఆదేశించింది

గృహాన్వేషణ జంజాటనలోపడి కొట్టుమిట్టాడు కుంటున్న నాకు ముక్తిప్రసాదించినదేవతగా "నా శ్రీమతిని మనస్సులో వేనోళ్ళ కొనయాడి నా తెలివితేటలను రికగ్నైజ్ చేసింది కనుక ఆ తరుణాన్ని వినియోగించుకుంటూ" అయితే యింత కాలం కాళ్లుపడిపోయేలా నాచేత ఊరంతా సర్వేచేయించి నన్ను చివరికి 'ఫూల్‌ని' చేస్తావా?'' అన్నాను వెటకారంగా కొంచెం కోపం కూడా జోడించి.

''పోనీలెండి దానివల్ల నష్టమేమీలేదు సోమరిపోతు ఉద్యోగంచేస్తూ తిన్నది అరగక ఆపసోపాలు పడేవాళ్ళకి ఊరంతా తిరిగితే ఒళ్ళు గట్టిపడి ఆరోగ్యం బాగు పడుతుంది'' అని యిన్నాళ్ళ నా తిప్పటవి జస్టిఫైచేసింది.

''ఇప్పటికి నీకు జ్ఞానోదయం అయిందన్నమాట. ఏదోలా సరిపెట్టుకుంటూ

ఎడ్జస్ట్ మెంటాలిటీతో ఉండాలిగాని తప్పు లెన్నడం మొదలుపెడితే మన స్వంత యింటిలో కూడా ఉంటాయ్ అందుకని స్వంతయింటిని వదిలి వెళ్ళిపోతామా?" అంటూ లాజికల్‌గా ప్రశ్నించేను నా తెలివి తేటలకి నేనే మురిసిపోతూ

"మీ తెలివితేటలకి సంతోషించేంకాని, నోరు మూసుకోండి మీ లెక్చర్స్ నా దగ్గరకాదు స్వంతయింటికీ అద్దియింటికీ పోలికేమిటి? కొడుకు గుడ్డివాడయ్యేడుకదా అని వేలు దిమ్మరించి అల్లుణ్ణి కూడా గుడి వాణ్ణి తెచ్చుకుంటారా ఎవరైనా?'' అని ఒక చురక తగిలించింది. కుదేలైపోయేను. అందుకే ఎప్పుడూ ఆమె ముందు నా నోటిని చాలా అదుపులో పెట్టుకుంటాను. ఎప్పుడైనా సమయం దొరికిందా అని నా వాక్చాతుర్యం చూపబోతే యిలాగే శృంగ భంగం అవుతుంది

మరునాడు సాయంత్రం కాలేజీనుంచి ఇంటికొచ్చి, కుర్చీలో చతికిలబడి షూ, టైయీ విప్పుకుంటున్నాను,

రోజూ ఆ సమయానికి చేతిలో కాఫీతో ప్రత్యక్షమయ్యే శ్రీమతి చేతిలో కాఫీకి బదులు ఒక ఉత్తరం కనిపించి ఏమిటి?'' అన్నట్లు ప్రశ్నార్థకంగా ఆమెవంక చూసేను ముఖం పక్కకు తిప్పుకుని ఆ ఉత్తరం నా చేతిలో పెట్టింది. ఆతృతగా చదివేను,

''శ్రీ వెంకటేశ్వరరావుగారికి.

భానుమూర్తి ఆశీర్వదించి వ్రాయునది, భగవదనుగ్రహం వలన, తమబోటి శ్రేయోభిలాషుల ఆశీర్వచన ప్రభావంవలన తమకు ఒక శుభవార్త తెలియజేయుటకు ఆనందిస్తున్నాను

నా కుమార్తె శారదకు వివాహము నిశ్చయమైనది, మొన్ననే తాంబూలాలు పుచ్చుకున్నాము వివాహము రెండు నెల లలో జరుగవలసి ఉన్నది భగవంతుడు ప్రసాదించిన స్వగృహంలోనే జరుపుట సమంజసము కావున అన్యధా భావించక ఈ లోపుగా యిల్లు ఖాళీచేయగలరని ఆశించుచున్నాను

దరిమిలా శుభలేఖ పంపెదను, తమరు కుటుంబ సమేతంగా వచ్చి వధూ వరు లను ఆశీర్వదించవలసినదిగా కోరు తున్నాను, చి॥ సౌ॥ శాంతమ్మకు పిల్లలకు నా ఆశీస్సులు.

ఇట్లు
తమ శ్రేయోభిలాషి,
భానుమూర్తి

శ్రీమతిచ్చిన కాఫీనీళ్ళు గొంతుగుకలో పోకొసుని, కొత్త చెప్పుల జత కొను క్కుందుకు బజారుకి బయలుదేరేను •

---

ఓ సంగీత విద్వాంసుడు 'నిధి చాలా సుఖమా!' పాడటం ప్రారంభించగానే ఓ శ్రోత ''నిద్ర మటుకు చాలా సుఖం" అంటూ ఒరిగిపోయాడు

—డి. ఉదయభాస్కర్, మద్రాస్.

# కళలు శిఖరాలు

(గత సంచిక తరువాయి)

ఈ మధ్య జ్వాలాముఖిలో కొండ జాతుల వారు, వారి ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, జీవన రీతులు గురించి వరసగా ఆర్టికల్స్ వ్రాస్తూ వచ్చాను. ఈ ఆర్టికల్స్ నచ్చినట్టుగా చాలా మంది దగ్గర నుంచి వుత్తరాలు రాసాగినాయి ఎక్కడ ఏ వింత చూసినా, ఏ కొత్త విషయం విన్నా అది యధాతథంగా నా పాఠకులకి అందించాలనే తపన నాలో అపరిమితం కాసాగింది. నేను జ్వాలాముఖిని చేత పట్టింది కొద్ది రోజులే అయినా, యీ తక్కువ వ్యవధిలోనే పాఠకులకి, నాకు ఒక అవినా నా భావ సంబంధం బలంగా ఏర్పడసాగింది.

పాఠకుల్లో కొంతమంది నన్ను ప్రోత్సహిస్తూ, ఫలాన చోటున ఫలాన విషయం వుందంటూ సూచనలు చేసేవాళ్లు వాళ్ళకి క్రమంగా యిది మన పత్రిక అనే సద్భావం ఏర్పడసాగింది. ఇది నాకెంతో తృప్తిగా అనిపించేది.

నెల రోజుల క్రితం హైదరాబాద్‌కి 40 మైళ్ళ దూరంలోవున్న ఒక పల్లెటూరు నుంచి ఒక టీచరు వుత్తరం వ్రాసాడు ఆ వూళ్లో ఏటేటా ఆ గ్రామదేవత కాలమ్మ వుత్సవాలు జరుగుతాయిట! ఆ రోజుకి అక్కడ చుట్టు పక్కల వున్న వూళ్ళ జనం అంతా వస్తారుట! ఆ వుత్సవంలో కోయవాళ్ళల్లో భిల్లులవి అనేక జానపద నృత్యాలు జరుగుతాయిట' అక్కడికి వచ్చే ఆ అమాయక జనం, వాళ్ళ నమ్మకాలు, ఆ మొక్కుకోవటాలు, మొక్కుబడులు తీర్చటాలు అన్ని విషయాలు 10. 15 పేజీలు వివరంగా వుత్తరం వ్రాసాడు త్వరలో యీ వుత్సవాలు వస్తున్నాయని, ముందుగా తను తెలియపరుస్తానని, మీ పత్రిక తాలూకు మనిషిని ఎవరినైనా పంపిస్తే స్వయంగా చూసి తెలుసుకో వచ్చునని వ్రాసాడు నేను వెంటనే జవాబు వ్రాసాను

అన్నమాట ప్రకారం ఆ టీచరుగారు ఫలాన రోజున రమ్మనమని నాలుగు

రోజులు ముందుగానే తెలియ జేశాడు. నా ఆఫీసులో గౌరీశంకర్ అనే అతన్ని ఆరోజు అక్కడకు వెళ్ళి అదంతా చూసి, ఫొటోలు తీసుకురమ్మనమని ముందే ఆదేశించాను. కానీ తీరా ఆ రోజు వచ్చేసరికి గౌరీశంకర్ తండ్రికి సుస్తీ చేసి చావు బ్రతుకులు కావడంతో అతను వెళ్ళలేక పోయాడు.

అక్కడ టీచరుగారు మా కోసం అన్ని ఏర్పాట్లు చేసి, ఎంతో ఆసక్తిగా ఎదురుచూస్తూ వుంటాడు. మేం తప్పకుండా వస్తామని వాగ్దానం చేసాం ఏ విషయం అయినా సరే అనుకున్న పని

"మీరు వూరు వెళుతున్నారుగా? తర్వాత వస్తాను."

నేను టైమ్ చూసుకుంటూ, "ఇంకా అరగంట టైముంది." అన్నాను

"అరగంట అసలు మొదలు పెట్టటానికే సరిపోదు" అంది

"అబ్బా! అంత సుదీర్ఘమైన విషయమా!" ఆశ్చర్యం నటించాను.

సత్య నవ్వింది నవ్వుతూనే కోపంగా చూసింది.

"మీరీ మధ్య బొత్తిగా ప్రతి విషయం నవ్వులాటగా తీసేస్తున్నారు"

## యద్దనపూడి సులోచనారాణి

అనుకున్నట్టుగా జరగకపోతే చెప్పలేనంత చిరాకు వస్తుంది.

గౌరీశంకర్‌కి వచ్చిన యీ యిబ్బంది వినగానే, ఆఖరి నిముషంలో చేతిలో వున్న పని పక్కకు పెట్టి ఆదరాబాదరాగా నేను ప్రయాణం అయాను. తీరా నేనింకో అరగంటలో బయల్దేరుతాననగా ఇంతలో సత్య వచ్చింది.

"మీతో ఒక విషయం గురించి అర్జెంట్‌గా మాట్లాడుదామని వచ్చాను." అంది

"ఎమిటా విషయం?" అన్నాను.

"నిజం! నాకు తెలియదు సుమా!" అన్నాను

"తెలియ చెప్పాలనేగా నా తాపత్రయం!"

నేను టైగట్టుకుంటున్న వాడినల్లా హఠాత్తుగా సత్యవైపు తిరిగాను

"సత్యా! నువ్వు కూడా నాతో రాకూడదూ?"

"నేనా!"

"అవును. మళ్ళీ సాయంత్రానికి తిరిగి వచ్చేస్తాం ఏం? నాతో రావటానికి ఏమైనా అభ్యంతరమా?"

"అబ్బెబ్బే! అదేం లేదు. కాపీ, ఆంటీ "

"సుభద్రమ్మగారికి నేను ఫోన్‌చేస్తాను నా మాట ఆవిడ కాదనరనే నమ్మకం నాకుంది " అంటూ ఫోన్ దగ్గరకి వెళ్ళాను

"వద్దు-వద్దు " సత్య అభ్యంతరం చెబుతూనే వుంది. నేను సుభద్రమ్మగారికి ఫోన్ చేసాను. నేను చెప్పింది సాంతం విన్న తర్వాత ఆవిడ—

"సత్య అక్కడ వుందా?" అని అడిగారు.

"ఉంది మళ్ళీ సాయింత్రానికి వచ్చేస్తాం సత్యని జాగ్రత్తగా తీసుకు వచ్చే బాధ్యత నాది!" అన్నాను

"సరే!" అన్నారావిడ

గంట క్రితం గౌరీశంకర్ వచ్చి, "సార్! నేను అక్కడికి వెళ్ళటానికి వీలు కాదు ఇంకెవరినైనా పంపండి," అని చెప్పినప్పుడు నాకు కలిగిన చిరాకు అంతా మాయమైంది. ఫోన్ పెట్టేసి నేను సత్య వెపు తిరుగుతూ—

"ఆంటీ ఒప్పుకున్నారు," అన్నాను

"ఆంటీకి మీ మీద చాలా గురి వున్నట్టుంది " సత్య నవ్వుతూ అంది

"అది అన్యాయంగా వచ్చింది కాదు చాలా శ్రమపడి దక్కించుకున్నది "

సూర్యం గదిలోకి తొంగి చూస్తూ, "జీప్ వచ్చింది సార్!" అన్నాడు.

ఈ ప్రయాణానికి నేను వెళ్లాలి అనుకోగానే తెలిసిన వాళ్ళకి ఫోన్ చేసి జీప్ తెప్పించుకున్నాను. జీప్‌లో నో-కారులోనో వెళ్ళి వస్తే నాకు టైమ్ కలిసొస్తుంది మిగతా పనులకి యిబ్బంది కలుగదు. ఉదయం వెళ్ళి రాత్రికి తిరిగి వచ్చేయ వచ్చుననుకున్నాను.

"నేను మీ దగ్గరకని మామూలుగా వచ్చేసాను. ఈ పళంగా ప్రయాణం అవ మంటే ఎలా? నా చీర కూడా బాగా లేదు " సత్య అభ్యంతరం చెప్పబోయింది.

"చీర కేం? బ్రహ్మాండంగా వుంది మనం అక్కడికి వెళ్ళి రిసెప్షన్‌కి గాని, ఫాషన్ పెరేడ్‌కి గాని వెళ్ళటం లేదు. టైమయిపోతోంది. ఎంత త్వరగా వెళితే అంత త్వరగా తిరిగి వచ్చేయవచ్చు." నేను అంటూనే చనువుగా సత్య జబ్బ పట్టి లేవదీసాను సత్య కూడా నాతో వస్తోందన్న సంతోషం ఒక్క నిముషం నన్ను నేను మరిచేలా చేసింది

"అరెరె! ఇదేమిటి," సత్య చప్పున నా చేయి వదిలించుకుంది.

ఇద్దరం బయటకి వచ్చాం.

బయట జీప్ దగ్గర సిద్ధంగా నిలబడి వున్న డ్రైవర్ నన్ను చూడగానే నమస్కరించాడు

"నువ్వు అవసరం లేదు. జీప్ సాయంత్రం 8 గంటల కల్లా పంపేస్తా నన్నానని మీ అయ్యగారికి చెప్పు .




"సువ్వెళ్ళు." అన్నాను డ్రైవింగ్ సీటులో కూర్చుంటూ.

సూర్యం నా కెమెరా. టవల్స్. సోప్. కొన్ని పళ్ళు. బ్రెడ్. బిస్కెట్స్. ఫ్లాస్క్ నింపిన బాస్కెట్ తెచ్చి జీప్ లో పెట్టాడు.

నేను జీప్ స్టార్ట్ చేయబోతుండగా. ఎదురుగా గేటులో నుంచి లోపలికి వస్తూ కుసుమ కనిపించింది. వెంట చిట్టి కూడా వున్నాడు.

"ఏం కావాలి కుసుమా!" అని అడిగాను.

కుసుమ తల అడ్డంగా తిప్పుతూ.

"ఏం లేదు. వూరికే వచ్చాను." అంది.

"పనిమీద వెళ్తున్నాను. సాయంత్రం వస్తాను." అన్నాను.

వెనక్కి తిరిగి బాస్కెట్ లో నుంచి బిస్కెట్ పాకెట్ ఒకటి తీసి చిట్టి చేతిలో పెట్టాను. అది చూడగానే వాడి ముఖం విప్పారింది. కుసుమ ముఖంలో తీవ్రమైన ఆశాభంగం చూపిన నేను యింకోసారి. "పనిమీద వస్తే చెప్పు." అన్నాను.

కుసుమ తల అడ్డంగా తిప్పింది.

నేను జీప్ స్టార్ట్ చేసాను. కుసుమ చిట్టి చేయి పట్టుకుని పక్కకు తొలిగి నిల బడింది ఆ అమ్మాయి చూపులు సత్య ముఖం మీద అంటుకుపోయినట్టుగా నిల్చి పోయినాయి.

దోవలో వస్తుండగా సత్య. "ఆ

# జరిగిన కథ

అసలు ఎక్కడా ఉద్యోగం రాకపోవడం. వచ్చినా అది నిలువక పోవడం నాకు పరిపాటి అయింది ఓ ఇంటర్వ్యూలో గోపాలంతో పరిచయం అయి దగ్గరి స్నేహితుడయ్యాడు ఉన్నట్టుండి అతనికి సుస్తీ చేయడంతో అతని డ్యూటీ నేను చేపట్టి, విధి నిర్వహణలో దొంగగా ఊహించ బడ్డాను

బాబాయి ఉత్తరానికి సమాధానంగా నేను ఆ వివాహం చేసుకోనని, తన అప్పు తీర్చలేని అసమర్థుడనని ఉత్తరం వ్రాశాను గోపాలం బల వంతంపై సినిమా హాలు గేటు కీపరుగా చేరి తలవని తలంపుగా పాత స్నేహితు రాలు శాంతిని చూశాను సిగ్గుతో కుంచించుకు పోయాను గతమంతా గుర్తుకు రాసాగింది

తరువాత జ్వాలాముఖిలో ఎడిటర్ ఆదరంతో ఉద్యోగం దొరికింది శాంతి నన్ను వాళ్ళ ఫ్యాక్టరీలో మేనేజరుగా చేరమని కోరింది నేను చేరనని ఖచ్చితంగా చెప్పాను ఆ ఖాళీ గోపాలాని కిప్పించాను పత్రికను ఉన్నతిలోకి తేవటానికి అనేక విధాల ప్రయత్నాలు చేయసాగాను పరిస్థితుల ప్రాబల్యం వల్ల పత్రికలో భాగస్వామిని అయ్యాను తెరవెనుక శాంతి పాత్ర ఎంతో ఉందని తరువాత తెలుసుకున్నాను

కుసుమను ఆత్మహత్యా ప్రయత్నం నుంచి రక్షించి లైబ్రరీలో గుమ స్తాగా చేర్పించాను సత్య కోరికపై యాక్సిడెంటు జరిగిన ప్రదేశానికి వెళ్లాను ప్రమాద వశాత్తూ భుజంలో కత్తి గుచ్చుకుంది' సత్య ఆదరంతో తిరిగి కోలు కున్నాను సుభద్రమ్మగారు తమ చనిపోయిన కొడుకు పోలికలు నాలో చాలా ఉన్నాయి అన్నారు

ఆఫీసులో నాకు, భాస్కరానికి పడటం లేదు నా కృషికి ఫలితంగా పత్రిక విలువ పెరిగింది. ఈ మధ్య సత్య కొంచెం-కొంచెం దగ్గరౌతోంది ఒకసారి గోపాలం ఇంటికి వెళ్ళాను గోపాలం ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది - నేను ఊహించ లేనంత।

ఇంతలో పిడుగులా సుదర్శనంగారు మరణించారనే వార్త నా మన స్సును కలచి వేసింది. పత్రిక శాంతి కొంటానంటే నేను ఒప్పుకోలేదు పత్రిక సర్వాధికారాలు నా చేతికి వచ్చాయి. అప్పు తీర్చటానికి శాంతి దగ్గరకు వెళ్తే డబ్బు తీసుకోలేదు.

సత్యను పెళ్ళికి ఒప్పించమని సుభద్రమ్మగారు నన్ను బలవంత పెట్టారు కానీ నా ప్రయత్నం ఫలించలేదు మా ఆఫీసు మరొక చోటికి మార్చి పార్టీ యిచ్చాను అందులో సత్య, స్నేహితులు ముఖ్య పాత్రలు వహించారు గోపాలం నాతో ముభావంగా ఉండటానికి కారణం శాంతే అని తెలిసి చాలా బాధ పడ్డాను. అతన్ని హెచ్చరించి బరువెక్కిన హృదయంతో తిరిగి వచ్చేసాను.

అమ్మాయి లేడీస్ క్లబ్‌లో లైబ్రేరియన్‌గా పని చేయటం మానేసింది తెలుసా?'' అంది.

''అలాగా! నాకు తెలియదే? '' అన్నాను.

"అత్తయ్య మీకు చెప్పలేదా?"

''ఉహూ! ఏది ఈ మధ్య నేను ఆవిడతో తీరికగా పట్టుమని పది నిము షాలు కూర్చునే వ్యవధి ఎక్కడ?'' అన్నాను.

కొంచం దూరం వచ్చిన తర్వాత సత్య నసుగుతున్నట్టుగా అంది "డ్రైవర్‌ని ఎందుకు వద్దన్నారు? వస్తే ఏమైందిట?"

''రాకపోతే మాత్రం ఏమైందిట?'' సత్య గొంతుని అనుకరిస్తూ వెక్కిరించాను. జీప్ వేగం అందుకుంది

* * *

మేం ఆ వూరు చేరుకునేసరికి దాదాపు 11 గంటలు కావచ్చింది ఆ వూరు వాతావరణం మబ్బు పట్టి అహ్లాదంగా వుండటం వల్ల ఏమంత శ్రమగా అనిపించలేదు వర్షాలకి కాబోలు రోడ్డు పాడయిపోయి గతుకులతో బొత్తిగా, అధ్వాన్నంగా వుంది. ఆ వూరు యింకా పది మైళ్ళు వుందనగానే మాకు బళ్ళ మీద జనం వెడుతూ గుంపులుగా కనిపించారు.ముదురు రంగుల దుస్తులతో, రకరకాల పూసల పేర్లతో, నగలతో, తమాషాగా వున్న తలపాగాలతో అందరూ చూడ చిత్రంగా కనిపించారు. కొంతమంది బళ్ళలో తమతో పాటు మేకల్ని, గొర్రెల్ని, ఆవూ దూడ లని కూడా తీసుకు వెళుతున్నారు.

మేం ఆ వూరు ప్రవేశించేసరికి— అప్పటికే అక్కడ జనం యినక వేస్తే రాలనంతగా కిట-కిట లాడుతున్నారు. రోడ్లమీద టీ దు కా ణా లు వెలిసి నాయి. వెదురు బొంగులు నాటి-వాటికి తాళ్ళు కట్టి దాని మీద రక-రకాల బట్టలు తాన్లు వేసి అమ్ముతున్నారు, బట్టలు, కుండలు, బొమ్మలు, తినుబండారాలు, ఒకటేమిటి ఆ సమయంలో అక్కడ దొరకని వస్తువు లేదేమోనవిపించింది పూసలు, గాజులు, రక-రకాల కుంకుమలు, రిబ్బన్లు అమ్మే దుకాణాలు వరసగా పెట్టి వున్నాయి. ప్రతీ దాంట్లో ఆడవాళ్ళు, పిల్లలు కిక్కిరిసి వున్నారు.

ఆ వూళ్ళో టీచరుగారి యిల్లు కనుక్కోవటం మాకంత కష్టం అనిపించ లేదు. మమ్మల్ని చూడగానే ఆయన ఎంతో సంతోషంగా, ''అరే! ఆడవారితో సహా వచ్చారే! నేను మీరింకరారనే అనుకుంటున్నాను," అన్నాడు.

సత్యని లోపలకు వెళ్ళమని భార్యని పిలిచి పరిచయం చేసాడు. పది నిముషాల తర్వాత ఆయన, నేను, సత్య ముగ్గురం కలిసి గుడి దగ్గరకి వచ్చాం. గుడి పాత కాలంది ఈ మధ్యనే సున్నం వేసినట్టు

న్నారు. లోపల చీకటిగా వుండటంతో దేవి ప్రతిమ సరిగ్గా కన్పించటం లేదు. పైనుంచి రంగు-రంగుల అడవిపూలతో కంఠం వరకూ కప్పేయబడి వుంది. పసుపు - కుంకుమతో ఆ చుట్టుప్రక్కల ప్రదేశం అంతా నిండిపోయి వుంది.

గుడిముందు రెండు-మూడు బృంధాల కోయవాళ్లు దఫాలవారిగా నృత్యాలు చేస్తు న్నారు, ఆ నృత్యం చేసినపుడు వారి శరీరాలు కదిలే తీరు, ఆ కేకలు ఒక్క క్షణం నాగరికత పేరు ఆసాంతం మరిచిపోయేలా చేసింది ఆ ముఖాల్లో ఎంతో ఆవేశం, భక్తి కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయి! ఆ నృత్యంలో మనసా-వాచా లీనమై పోయినట్టుగా వున్నారు. సహజంగా విగ్రహారాధన పట్ల అంతగా నమ్మకంలేని నేను-ఆవేశంతో, నమ్మకంతో, భక్తితో వూగిపోతున్న వాళ్ళని చూడగానే క్షణం సేపు విచలితుడైనట్టు అలాగే నిలబడిపోయాను ఈ దేశంలో దైవంపట్ల నిస్సంకోచమైన నమ్మకం అనేది ఎక్కడైనా వుంటే అది వీళ్ళలోనేనని నాకు గాఢంగా అనిపించసాగింది

మావెంటవున్న మాష్టరుగారు మాకు ఆ దేవతయొక్క మహిమ గురించి ఏకధాటిగా చెబుతున్నారు. వీళ్ళలో చాలా మంది ఆయన్ని ఎరుగున్నట్టున్నారు. ఆయన్ని చూడగానే నమస్కరిస్తున్నారు. గవర్నమెంట్ యీ మధ్య యిక్కడ స్కూలు పెట్టింది, దానిలో వీళ్ళలో చాలామంది పిల్లలు చదువుకుంటున్నారని ఆయన చెప్పాడు.

గుడికి ఒక పక్కగా పెళ్ళి జరుగుతోంది వాళ్ళు చాలా మామూలువాళ్ళు పిల్లకి తల్లి-తండ్రి లేరట! దైవం ముందు జరిగిన పెళ్ళికి తిరుగులేదని వారి విశ్వాసం పెళ్ళి చాలా క్లుప్తంగా, నిరాడంబరంగా జరిగిపోతోంది నేను అక్కడ ఫోటోలు తీసుకుంటుండగా సత్య చటుక్కున నా పక్కకి వచ్చి, "నాకో రెండు రూపాయిలు యివ్వండి" అంది

"ఎందుకు!" జేబులోంచి చేతికి వచ్చిన 10 రూ॥ కాగితం తీసి సత్య చేతికి యిస్తూ ఆశ్చర్యంగా అడిగాను.

"నేనిప్పుడే వస్తాను" అంటూ సత్య చరచరా అక్కడనుండి వెళ్ళింది

నేను అర్థంగానివాడిలా సత్య వెళ్ళిన వైపే చూస్తూ నిలబడ్డాను.

సత్య దూరంగా వున్న దుకాణాల్లోకి వెళ్ళి కొన్ని పువ్వులు, పళ్లు కొనితెచ్చింది అవి మాష్టరుగారు చేతికి యిచ్చి, "వాళ్ళకివ్వండి" అంది

మాష్టరుగారితోపాటు నేను కూడా తెల్లబోయాను,

ఆయన మా పేరు చెప్పి వాళ్ళకి యిచ్చారు

పెళ్ళికూతురు మా వైపు సిగ్గుగా

కళ్లెత్తి చూపింది. ఆ కళ్ళలో చిరునవ్వు. సంతోషం, కృతజ్ఞత మూగగా కన్పిం చాయి.

మేం అక్కడనుండి యివతలకి వచ్చే స్తుండగా సత్య చప్పున కళ్ళు తుడుచు కోవడం కనిపించింది నాకు. నేను దగ్గ రగా వెళ్ళాను. మాష్టరుగారిని ఎవరో పిలవగా దూరంగా వెళ్ళారు జనం వత్తి డిలో సత్యకి దగ్గరగా నడుస్తున్న నేను సత్య మోచేయి పట్టుకుంటూ, "సత్యా! ఏమిటిది?'' అన్నాను సత్య వులిక్కి- పడ్డట్టుగా తిరిగి చూపింది ఆశ్చర్యం నిండిన ఆ కళ్ళలో తడి యింకా స్పష్టంగా మెరుస్తూనే వుంది.

"ఏమైంది? ఎందుకలా వున్నావు?" తగ్గుస్థాయిలో అడిగాను

''ఏంలేదు '' సత్య నాచేయి మెల్లగా వదిలించేసుకుంది

''నాకు చెప్పకూడదా? వినే అర్హత నాకు లేదన్నమాట!'' కావాలనే విష్ఠూ రంగా అన్నాను.

''అబ్బే! అదేంలేదు.'' తర్వాత చెప్ప లేక చెబుతున్నట్లుగా అంది.

"బావతో కలిసి వెళ్ళిన పెళ్ళి జ్ఞాపకం వచ్చింది. ఆ రోజు–'' సత్య గొంతు గద్గదికమైంది.

నాకెందుకో సత్య మాటమీద సాను భూతి కలగలేదు. నిజం చెప్పాలంటే ఆగ్రహం వచ్చింది ప్రసాద్ పోయి సంవత్సరాలు కావస్తోంది సత్య ఆ జ్ఞాప కాలు వదిలి బైటికి రావడంలేదు! కనీసం రావాలని ప్రయత్నించటంలేదు! నేను సత్య చేయి వదిలేసాను ఇంతలో మాష్టరుగారు మా దగ్గరకి వచ్చారు.

మధ్యాహ్నం దాటుతుండగా యింటికి తిరిగివచ్చాం. నేను బహుశా యిలాటి తిరునాళ్లు యింతక్రితం ఒకటి రెండు చూడటంవల్లనేమో యివి అనుకున్నంతగా నాకేం గొప్పగా కనిపించలేదు. కానీ సత్యకి మాత్రం చాలా నచ్చింది సత్య కోరికమిద భోజనం చేసిన తర్వాత మళ్ళీ వెళ్ళి అవన్నీ తిరిగాం. నేనయితే అప్పుడే తిరుగుముఖం పట్టి వుండేవాడిని.

ఆ వూరికో ఏ దిక్కున నిలబడినా, దూరంగా కొండమిద శిఖరాగ్రాన వున్నట్టు పాడుబడిన కోట ఒకటి కన్పిస్తోంది నేను దాన్ని గురించి మాష్టరుగారిని అడిగాను అది చాలా పురాతనం కోట అని, దాన్ని

---

ఆమె 'ప్రియా, నీతో ఉంటే నెల ఒక రోజులాగ గడిచిపోతున్నాదనిపిస్తుంది కానీ నీ జీతం 100 రూ॥ లతో మనం '

అతడు 'అదేమిటి ప్రేయసీ! నువ్వన్నట్టే రోజుకి 100 రూ॥ చాలవా?'

—యం. రామారావు, బరంపురం-2.

గురించి రకరకాల గాధలు వున్నాయంటూ, ఆయన ఓ పది కథలు చెప్పాడు. శిధిల మైన ఆ కోట పూర్వమెప్పుడో ఒక నవాబు గారు, అందాలరాణి అయిన ఒక రాజ నర్తకి కోసం ప్రత్యేకంగా కట్టించాడుట! ఆయన విశ్రాంతి కావాలనుకున్న సమ యంలో యిక్కడకు వచ్చి ఆ రాజనర్తకి దగ్గర గడిపి వెళ్ళేవాడుట! ఆ అందాల సుందరిని ఎత్తుకుపోవటానికి ఆయన మీద ఎందరో దాడి వచ్చి విఫలమై తిరిగి వెళ్ళి పోయారుట. ఆ రాజనర్తకి ఆయన ఒక్కడిముందే నాట్యం చేసేదిట! ఆ నర్తకి నృత్యం చేసే నాట్యమంటపం యిప్పటికీ చెక్కుచెదరకుండా అలాగే వుందిట! నల్ల చలువరాతితో చేసిన ఆ మంటపం పనితనం చూసితీరాల్సిన అద్భు తంట! ఆయన ఆపకుండా వర్ణించి చెబు తూంటే నాకు ఆ కోటని చూసితీరాలనే ఆసక్తి కలగసాగింది. దాంతో సత్యని తొందరచేసి, బాగా పొద్దు వుండగానే వెంటనే బైలుదేరాను. మేము ఆ కోటని చూసి, మళ్ళీ యిక్కడకు తిరిగిరానవసరం లేదని అటునుంచి మరో దోవన 5 మైళ్ల వెళితే అది హైదరాబాద్ కి వెళ్ళే మెయిన్ రోడ్డుకి కలుస్తుందని మాష్టరుగారు ఆ దారి గుర్తులు వివరంగా చెప్పాడు. నేను సరేనన్నాను.

ఆయన మా వెంట వూరి చివరవరకూ వచ్చి కోట శిధిలాలు చూడటానికి ఎటు వైపునుంచి వెళ్ళాలో ఒకటికి రెండుసార్లు హెచ్చరించి వీడ్కోలు తీసుకున్నాడు. నేను-సత్య ఆయనకి కృతజ్ఞతలు చెప్ప కుని, హైదరాబాద్ వస్తే మా పత్రిక ఆఫీస్ కి తప్పక రమ్మనమని మరీ మరీ చెప్పి బైలుదేరాం.

మాష్టరుగారు చెప్పిన గుర్తులని బట్టి ఆ కోట శిధిలాలు చేరుకోవటానికి మాకు అట్టే కష్టం కలగలేదు ఎక్కువ సమయం కూడా పట్టలేదు ఒక్క 5 మైళ్ళు దోవ సమతలంగానే వుంది తర్వాత చిట్టడవి ప్రారంభమైంది కొండ చుట్టుకుంటూ జీప్ పైకి వెళ్ళింది.

జీప్ శిధిలాల ముందు ఆగేసరికి సూర్యుడు పశ్చిమ దిశకి వాలుతూవున్నాడు. నేను చప్పున రెండు-మూడుయాంగిల్స్ లో ఫోటోలు తీసుకున్నాను. సత్యని కోట ముందు నిలబడమని రెండు మంచి స్నాప్స్ తీసుకున్నాను తర్వాత యిద్దరం కోటంతా తిరిగిచూసాం. మాష్టరుగారు కోటని గురించి చెబుతుంటే అతిశ యోక్తులై వుంటాయని అనుకున్నాను. కానీ ఆ నాట్యమంటపం చూస్తుంటే ఆయన చెప్పిన దాంట్లో రవంత కూడా ఎక్కువ లేదనిపించింది నల్ల పాలరాతిలో నగిషీ చెక్కిన ఆ స్థంభాలు, ఆ పనితనం చూస్తుంటే, యీ కళ, యీ పనితనం యీనాడు ఏమయిపోయింది అనే ఆవేదన రాకమానదు! ఏదేశ సంస్కృతి అయినా శోభాయమానంగా వెలగాలంటే ముందు

-బ్బు అవసరం! దారిద్ర్యంలో సర్వ కళలూ నాశనం అవుతాయి కాబోలు! వుండటానికి, కూడుకి, గుడ్డకీ తడుము కుంటున్న మనుష్యులు అందాల్ని ఎక్కడ పోషించగలరు అనిపించింది.

సత్య ఆ కోటంతా తిరిగి చూస్తూ, సంభ్రమంగా "ఎంతో బాగుంది కదూ." అంది.

"ఎంత బాగుందేం!" రెట్టించాను.

"చాలా బాగుంది! నాకయితే యిక్కడ నుంచి కదల బుద్ధికావడంలేదు."

"అయితే యీ రాత్రికి యిక్కడ వుండిపోదామా!" సత్య ముఖం ఎర్ర బడిన తర్వాత కాని నేను అనాలోచితంగా అన్న మాటల్లో శ్లేష నా కర్థంగాలేదు.

సత్య చటుక్కున నా కంటే ముందుగా జీప్ దగ్గరికి వెళ్ళిపోయింది. సత్య వెంటే వచ్చిన నేను, జీప్‌ని పరీక్షించినట్టునటించి, "మైగాడ్ పెట్రోలు అయిపోయింది." అన్నాను

సీరియస్‌గా ఎటో చూస్తున్నట్టు నిల బడిన సత్య అంతెత్తున ఎగిరిపడ్డట్టుగా నా వైపు తిరిగింది.

"నిజంగా?" అంది.

సత్య కళ్ళలో రెపరెపలాడిన భయం చూసి నేను ఫక్కున నవ్వాను సత్య కోపంగా చూసింది

"తమాషాకి యిది సమయమూకాదు, స్థలమూ కాదు" అంది.

"ఇంత అందమైన ఆవేశంలో తమా షాగా, సరదాగా వుండ లేని మనిషి మనిషేకాదని నా నమ్మకం।"

సత్య వాచీ చూసుకుంది "ఇప్పుడు టైమెంతయిందో తెలుసా?"

"ఉదయం నువ్వు నాతో వస్తానని అన్నప్పుడే నాకు టైమ్ ఆగిపోయింది" జీప్‌లో ఎక్కి కూర్చుని స్టార్ట్ చేస్తూ అన్నాను

సత్య భయం నటిస్తూ కోటవైపు వేలు చూపిస్తూ అంది ,

"మాష్టరుగారు చెప్పిందినిజమేనేమో। ఆ కోటలో నిజంగానే దెయ్యాలు వున్న ట్టున్నాయి. మీ వరస చూస్తూంటే ఒకటి మిమ్మల్ని ఆవరించినట్లే వుంది"

"వాటికెంత పక్షపాతం। నిన్ను వది లేసి నన్ను ఒక్కడినీ పట్టుకోవటం అన్యాయం కదూ।"

సీరియస్‌గా చూడబోయిన సత్య ఫక్కు మని నవ్వేసింది నేనూ నవ్వాను సత్య కోపం పోయి మామూలుగా అయినందుకు నా మనసు తేలికపడింది

చీకటి పడబోతోంది అడవిలో పక్షుల కలకలం వీనులవిందుగా వుంది మాష్టరుగారు చెప్పిన గుర్తులు జ్ఞాపకం వుంచుకొని ఆ దోవ వెంటనే జీప్ ని డ్రైవ్ చేయసాగాను సత్య వెనక్కు వాలి ఆలోచనలో పడ్డట్టుగా, అడవిని చూస్తూ కూర్చుంది.

"ఈ ట్రిప్ ఎల వుంది సత్యా।" మృదువుగా అడిగాను

"బాగానే వుంది, కానీ మన వెంట డ్రైవర్‌కూడా వస్తే బాగుండేది।"

"వచ్చినందువల్ల ఒరిగేదేమిటి?"

"మనం యిలా వచ్చామని తెలిసినా ఎవరూ ఏమీ అనుకునేవారుకాదు,"

"అనుకునేవాళ్ళు ఎప్పుడూ మానరు అసలు యీ అసలు వారికి అనుకోవటం అనేది ఒక సరదా। ఆ విషయం మనకి యిబ్బంది కలగనంతవరకూ చూసి చూడ నట్టు వదిలేయాలి"

"'ఆంటీ' ఏమనుకుంటాందో।"

"సుభద్రమ్మగారా। ఆవిడ ఏం అను కుంటారు? నేనేమైనా ఆమెకి తెలియకుండా నిన్ను రహస్యంగా తీసుకువచ్చానా?"

(సశేషం)

---

కర్త (ధర్మామీటరు నోట్లో పెట్టుకున్న భార్యను చూసి డాక్టరుతో) డాక్టర్‌గారూ। మీరు ఆమె నోట్లో పెట్టిన ఆ గాజుగొట్టం ఎంత ఈ రెండు నిమిషాలే మా ఆవిడ నోరు విప్పకుండా ఉండేట్టు చేయగలిగిన ఆ పనిముట్టు ఒకటి ఇంట్లో ఉంటే తప్ప బతకలేననిపిస్తోంది



# చిక్కుముడి

ఇచ్ఛాపురపు
రామచంద్రం

సీతాలు మనసు చివుక్కుమంది.

ఎదలో యీత ముల్లు గుచ్చుకున్నట్లుంది

గుండెలు భగ భగ మండిపోయాయ్.

అయినా—

ఉక్రోషాన్నంతటినీ ఉగ్గబట్టుకుంది.

నారయ్యకీ పింగికీ హారతిచ్చింది.

పసుపు బట్టలలోని ఆ జంటను లోపలకి నడిపించింది.

నడిపిస్తూ—

సీతాలు పింగిని ఆపాదమస్తకం పరికించింది

ఒక్క చూపులో— కీలకం తెలుసుకుంది.

పింగి సింగారమంతా ఎక్కడ దాగుందో యిట్టే పట్టేసింది సీతాలు

ఒక్కక్షణం— అసూయపడింది.

ఆ కొప్పు-చక్కదనాల పుట్ట ఆ అందమయిన కొప్పులో-నారయ్యలాటి మొగాళ్లెందరినయినా ముడుచుకోగలదు పింగి. అందమంతా ఆ కొప్పులోనే. ముఖంలో ఏమీ కళాలేదు. కాంతీలేదు.

సీతాలు తెలివితక్కువదా?

కానేకాదు.

బ్రతుకుతెరువు బాగా తెలిసిన మనిషి. అందుకే-ఏ మాత్రం అల్లరిచేయకుండా - యిటూ తిప్పుకుంటున్నాడు.

అది-సీతాలుకి కొండంతబలమిచ్చింది.

ఆమె ఆశలను పురెక్కించింది.

పిట్ట యింక వలలోంచి ఎగిరిపోలేదులే అని ధైర్యం చెప్పుకుంది తనకుతానే సీతాలు.

మళ్ళీ జాలిపడింది సీతాలు - మొగుడిమీద

సీతాలు జాలి మొగుడిమీదేకాదు-ప్రతి

---

మగ మహారాజుల మోజు ఎప్పుడు ఏ వైపు మొగ్గుతుందో? కీలెరిగి వాత పెట్టడం మహారాణులకు తెలిసుంటే రాజరికం రాళ్ల పాలు గాకుండా వుందేదేమో? కనీసం ఆపద్బాంధవుడు ఏడుకొండలవాడు పూనినట్లు నటించడం నేర్చివున్నా మగ మహారాజుల మోజులు మట్టిలో కలసిపోయేవేమో?

---

ఏడుపులూ, పెడబొబ్బలూ పెట్టకుండా — కళ్ళనిండా కపటప్రేమ నింపుకుంది మనసులో ముళ్ళపొదలు రేగుతున్నా - ముఖమంతా నవ్వు చేసుకుని - పింగిని - తన సవతిని - ఆహ్వానించింది పింగిని చూసి అసూయపడింది మొగుణ్ణి చూసి జాలిపడింది.

మరి—నారయ్య?

సీతాలు ముఖంలోకి సూటిగా చూడటానికి సిగ్గుపడుతున్నాడు. చూపులటూ మొగాడిమీదాను.

మొగవాడు గాలిపటం వంటివాడు. ఆడది దారమై పటాన్ని కాపాడుకుంటూ ఉండకపోతే - మోజు తీరగానే - దారం భారమై - సందు చూసుకుని బంధం తెంపేసుకుని - ఎక్కడెక్కడో ఎగిరి - చివరకు ఏ ముళ్ళతుప్ప మీదనో పడి - లేదా - కుళ్ళు కాలువలో దిగి-బ్రతుకంతా బగ్గంపాడుచేసుకుంటాడు మొగాడు. మొగాడు ఒట్టి తెలివితక్కువ గండు




తుమ్మెద. పువ్వు కనిపించడం తడవు - వాలడమేకాని-అందులో తీపి తేనే ఉందో, లేదు విషమేఉందో కనుక్కోలేనిఅమాయకుడు. ఈ తెలివితక్కువతనం - మొగాడి నైజం. దేముడు అన్ని కట్టుబాట్లూ ఆడదానికే పెట్టాడు కానీ మొగాడికేముంది? ఒట్టి గాలివాటం ఏ క్షణానికెటు తిరుగుతుందో?

సరే మొగాడు, నారయ్య అలా చేశాడు. సాటి ఆడదానికి తగుదునమ్మా అంటూ సవతిగా రావడం సింగికెలా మనసుపోయింది? ఆడదాని మీద ఆడదానికే జాలిలేకపోతే మొగాడికెందుకుంటుంది?

నారయ్యలాటి మొగాడి నీడలో పది కాలాలపాటు పదిలంగా బ్రతకడం ఎంత కష్టం! ఒట్టి నీడవాటం మనిషి ఏ వేళ ఎటువైపు మొగ్గుతాడో ఎవరికెరుక?

* * *

రోజులు గడుస్తున్నాయ్.

బతుకు గురించి—

భవిష్యత్తు గురించి—

ఆలోచనలలో పడవలసివచ్చింది సీతాలుకి

ఇకనుంచి తన గతేమిటని ప్రశ్నించుకుంది.

ఇరకాటంలో చిక్కుకున్నా అని చింతించింది.

సీతాలు తీవ్రంగా ఆలోచించింది.

ఏడుమనువుల వరకూ ఆడదానికి అడ్డు లేదు ఎటొచ్చీ తను ముగ్గురు బిడ్డలతల్లి, ముప్పయ్యేళ్ళు దాటిన ఆడమనిషి తను అడిగినా - తనను మారుమనువాడే మొగాడెవడు? తనలో ఏముందని? ముగ్గురు బిడ్డలకూ కండలు కరిగించి యిచ్చేసింది ఒంట్లో ఏక్కడా పిడికెడు మాంసంలేదు. ఏం జూసి మనువాడుతాడు తనని ఎవడయినా?

పోనీ ఏ ముసలాడయినా కక్కుర్తి పడబోయినా అటువంటి ముదివగ్గుతో తన బ్రతుకూ పిల్లల బ్రతుకూ తెల్లవారేదెలా? ఎవరికో కన్న బిడ్డలని వాడు సరిగా చూస్తాడని భరోసా ఏమిటి?

అన్నాళ్ళు అన్నేళ్ళ నా ర య్య గుండెలలో గువ్వలా ఒదిగి బ్రతికింది, చేతనయిన మేరకు - ఏమీ దాచుకోకుండా వాడిని సుఖపెట్టింది ముగ్గురు పిల్లల్ని కని-వంశం నిలిపింది ఆడదానికి కాన్పు పునర్జన్మే మామ చేసిన నిర్వాకానికి మూడుసార్లు మృత్యువుతో హోరాహోరి పోరాడి-పిల్లల్నికంది

అదంతా మరచిపోయి — తన పీకెల మీదకి సవతిని తెచ్చాడు మామ. మామ మీద కోపం తెచ్చుకొని మారుమనువాడినా తన బతుకూ పిల్లల బతుకులూ కుక్కలు చింపిన విస్తరే అవుతుంది

మరేమిటి చెయ్యాలి?

ఎలాగో యీ కా పు ర మే నిలుపు కోవాలి

చెదిరిపోయిన గూడుని సరిజేసుకోడం మంచిది కాని గూడు వీడి గుట్టలపాలౌడం- అదేం వివేకం? తెలివితేటలతో తననీ పిల్లలనీ కాపాడుకోవాలంతే, మరో తోవ తొక్కనేకూడదు.

''ఏటే సీతాలూ అలాగున్నావ్? నీ కన్నాయం సేశానా?'' అడిగాడు నారయ్య ఓనాడు

అప్పటికి వాడు సింగిని తెచ్చుకుని పదిరోజులౌతుంది.

జాణలా నవ్వి - ఏమాత్రం తేలిపో కుండా అంది సీతాలు- ''నువ్వేటి సెయ్య గలవ్ మాఁవా? మొగాడివి మనసైన దాన్ని తెచ్చుకున్నావ్ అంతా నా దుర దృష్టం దేముడు నాకిలా రాసిపెట్టాడు నువ్వెంత మంచివాడివయినా - నేనంటే నీకెంత మనసయినా-నొసటిరాత తప్పించ లేవు కదా?''

''నిజఁవేనే సీతాలూ ఏటో కలలా జరిగిపోయింది నాకు తెలుసు—నీ మనసు ఎన్నపూస అసలు నువ్వు నలుగురిలో ఎన్నదగ్గ మనిషివి నా మనసెరిగి మసులు కుంటున్నావు సింగిని నీ సొంత సెల్లిలి గా చూసుకో ఒకటిమాత్రం గుర్తెట్టుకో

''ఏటి మామా?''

''మనసిప్పి సెప్తున్నాను - మంచి కయినా సెడ్డకయినా మొదటిమాట నీదే నిజంగా అంతే ''

''చాలు మామా ఆ మాత్రం చల్లని మాట చాలు నీకు నా మీదా నా పిల్లల మీదా ఆపాటి జాలి ఉంటే అదే పది వేలు ''

బయటకు అలా అందేకాని మనసులో అలా అనుకోలేదు సీతాలు మరేమను కుంది?

ఆ సింగారి ఏదయినా చెప్తే కాదనే

ఏ లేదు మామా. నీకు దానిమీద ఉన్నది మోజు నామీద ఉన్నది ప్రేమ ప్రేమకంటె మోజుకే ఎక్కువ బలం ఎలాగంటే - నేను విన్న రాజుల కథలలో ఏం జరిగింది? పెద్ద భార్యల గతి ఎప్పుడూ ఏడుపే ముద్దూ మురిపెమూ అంతా చిన్న భార్యకే. నువ్వూ ఆ రాజుల వంటి మొగాడివేకద నువ్వనేకాదు - ఏ మొగాడికయినా-పదేళ్ళు కాపరం చేసిన పెళ్లాంకంటె ఏ పరాయి ఆడదైనా పసందుగానే కనిపిస్తుంది అదీకాక-సింగికి నా కంటె సింగారం ఎక్కువ నాకు తక్కువ నీ బాధ నాకు తెలుసు నువ్వూ మా యిద్దరి మధ్యా నలిగిపోతున్నావ్ తొందరగానే నీకి బాధ తప్పించి నాకు ఒక్కర్తికే దక్కించుకుంటాను

అలా అనుకుంది సీతాలు.

గుండెలోని గుబులుని రవంత అయినా బయటకు చిందనీయకుండా - పైపెచ్చు - సింగిమీద ఎక్కడలేని ఆపేక్ష వొలకబోస్తూ-తనకని నారయ్య తెచ్చిన కొత్త చీర సింగికి చుట్టబెట్టి - స్వయంగా చేయి పుచ్చుకుని సింగిని నారయ్య గదిలో అప్పగించి వచ్చింది నవ్వుతూ

ఇరుగుపొరుగూ ముక్కు మీద వేలేసుకున్నారు

సీతాలు ఎటువంటి ఆడదో ఎవరికీ అర్థంకాలేదు చివరకి నారయ్యకీ సింగికీ కూడా సీతాలు చిత్రమైపోయింది

"ఈ వయసులో సవతిపోరు ఎంత కష్టం" అంటూ ఓదార్చ వచ్చిన యిరుగు పొరుగుని "కష్టమేమిటి? మేమిద్దరమూ అప్పాసెల్లెళ్ళలా కలసిమెలసి సుకంగా ఉన్నాం" అని విదిలించి పారేసింది సీతాలు వాళ్లు తెల్లముఖాలు వేసి వెళ్ళిపోయారు నిజమే సవతిని నెత్తికెక్కించుకునే ఆడదెవర్తె ఉంటుంది?

సితాలు తెలివితక్కువ ఆడదా?

కాదు

సీతాలుకి బతకడం తెలీదా?

తెలుసు బా॰ తెలుసు.

---

ఒక డాక్టరు, కారు మెకానిక్కు తమ తమ వృత్తులోని కష్టాల్ని గూర్చి మాట్లాడుకుంటున్నారు

"నా వృత్తి కష్టభూయిష్టమైంది" అన్నాడు కారు మెకానిక్కు "ప్రపంచాది నుంచీ మానవ శరీరంలోని యంత్రాంగంలో ఎలాటి మార్పూలేదు కాని కార్లు ఎన్ని మోడల్స్ ఉన్నవో, ఎప్పటికప్పుడు వాటి మెకానిజమ్‌లో ఎన్ని మార్పులు చేయబడుతున్నవో - వాటిని గూర్చి తెలుసుకొని మరామ్మతులు చేయటం ఎంత కష్టమో ఆలోచించండి!

మరి?

బతుకుని భద్రపరచుకోడానికే సీతాలు తాపత్రయం అంతా

ముల్లుని ముల్లుతోనే తియ్యాలి

ఎవరికీ చేదూ చెడూ కాకుండా బ్రతుకు బాగుచేసుకోవాలి

ముఖ్యంగా - నారయ్య మనసు విరిగి పోకూడదు

అవకాశం కోసం ఎదురుచూస్తూంది సీతాలు - కాటు వెయ్యడానికి పడగవిప్పి సిద్ధంగా ఉన్న త్రాచుపాములా

అదనెరిగి మట్టు పెట్టాలి కీళెరిగి వాత పెట్టాలి దేనికయినా నిదానం ప్రధానం- ఇది సీతాలు తత్వం

ఆసుకున్న సమయం రానే వచ్చింది.

రెండు రోజుల నుంచీ సింగి వొంట్లో నలతగా ఉంది. ఒళ్ళు వెచ్చబారింది

నారయ్య తల్లడిల్లి పోతున్నాడు గచ్చాకు పుచ్చాకు మందులు వాడినా జ్వరం జారలేదు కొంచమయినా

సింగి ముద్ద ముట్టలేదు

అందుకని నారయ్య ముట్టలేదు

అందుకని సీతాలూ ఎంగిలి పడలేదు

ఎంగిలి పడని సీతాలు-ఎంకటేశ్వర్లుని విడచి రావడం లేదు

ఎప్పుడు చూసినా ఎంకటేశ్వర్లు పటం ముందే?

"నాకేటి పాః శేతా సీః బేలగా అన్నాడు .

దిగులుగా చూసింది సీతాలు మామ వంక

"సింగికి జ్వరం తగ్గుతుందా? మళ్ళీ మనిషౌతుందా?"

"అవుతాద మామా! ఎంకన్న అలాగే చెప్పారు "

"ఎంకన్న చెప్పాడా? ఏటి సెప్పాడే?" సీతాలు భుజాలు పట్టి కుదుపుతూ ఆత్రుతగా అడిగాడు నారయ్య

"ఊఁ " మూలిగింది సీతాలు

ఒక్కసారిగా కళ్ళు ఎర్రబడి పోయాయ్.

మనిషి అటూ-ఇటూ ఊగ సాగింది.

ఒక్కసారి గట్టిగా అరిచింది

నారయ్యకి అర్ధమై పోయింది—సీతాలు మీద ఎంకన్న వాలాడని పరుగెత్తుకు వెళ్ళి నలుగురినీ పోగేసుకొచ్చాడు

నలుగురి ముఖాలూ చూసి మళ్ళీ హుంకరించింది.

అందరి కళ్ళూ సీతాలు మీదే ఉన్నాయి

"సింగికి జ్వరం తగ్గించు సామీ! ఏడుకొండల సామీ ఎంకన్నా నా సింగిని కాపాడు నీకేటి కావాలంటే అదే యిస్తాను " ప్రార్ధించాడు నారయ్య




"ఊఁ తగ్గిస్తాను నీ సింగిని కాపాడతాను . మరి "

వెనక్కి విరుచుకు పడిపోయింది సీతాలు అంటే—ఎంకన్న వదిలి పెట్టేసేడన్న మాట. ఇది నలుగురికీ తెలుసు. ప్రశ్నలడగదల్చుకున్న వారికి ఆశాభంగం అయింది.

రెండు క్షణాలలో సీతాలు కళ్లు తెరి చింది

అలవాటుగా ఎంకన్న ఫొటో తెచ్చి అందించాడు నారయ్య.

దాన్ని గుండెల కదుముకుంది సీతాలు

"సీతాలూ! దేముడేటి సెప్పాడు?"

అందరూ ఆమె ఏం చెప్తుందో అని ఎదురు చూస్తున్నారు.

ఆమె—చెప్పలేనట్లు తల పంకించింది

"పరవాలేదు. సెప్పు దేముడేటడి గాడు? కొండ మీద కోతినయినా తెచ్చి ముడుపు సెల్లిత్తాను."

"ఎలా చెప్పేది మామా నాకు నోరు రావడం లేదు కోరరాని కోరిక కోరాడు ఏడు కొండలు "

"సెప్పు-సెప్పు అదేదైనా పరవా లేదు బేగి సెప్పు "

"దేముడికి కూడా మోజయింది మామా! చిన్నదన్న కనికారమైనా లేకుండా

సింగి సిగ అడిగాడు. నేనేలాగూ పెద్ద దాన్నయి పోయాను ...నా సిగ తీసుకో అన్నాను అంతకీ. ససేమిరా—సింగి కొప్పే కావాలన్నాడు ఎంకన్న. ఎంత మొత్తుకున్నా యినలేదు. చిన్నదాని బతుకులో సింగి బుగ్గి పొయ్యకని వేడుకున్నా కరగలేదు. సిగ యివ్వకపోతే సింగినే తీసుకు పోతానన్నాడు. రేపు తెల్లవారేలోగా సింగి సిగ [illegible]." ఇక చెప్పలేక పోయినట్లు ఊరుకుంది సీతాలు.

ఆలోచనలో పడ్డాడు నారయ్య.

కొంచం సేపు అయ్యాక మెల్లగా అంది సీతాలు. "దాని బతుకులో బుగ్గి పొయ్యకంటే యినలేదు ఎంకన్న. తన మోజు తీర్చకపోతే ఊరూ వాడా ఏకం చేసి సాగరంలో ముంచెత్తేస్తానని బెదిరించాడు."

అందరూ తుళ్ళి పడ్డారు.

గుమిగూడిన నలుగురూ బెదిరి పోయారు.

సింగికి మతి పోయింది

నారయ్య దిక్కులు చూస్తున్నాడు.

సీతాలు [illegible] సింగి నెత్తి నట్టింగి [illegible]

"దేముడి మోజు తీర్చి—ఊరుని కాపాడకోవలసిందే! ఇందులో ఆలో చించడానికేమీ లేదు. ఎంకన్న మోజు తీర్చవలసిందే!"

నీరు కారిపోతూ నిల్చున్నాడు నారయ్య.

బొట-బొట కన్నీరు కారుస్తూంది సీతాలు.

సింగి లబో దిబోమని కొట్టుకుంటున్నా వినలేదు ప్రజలు.

నలుగురూ కలసి సింగిని పట్టుకున్నారు స్నానం చేయించారు. పసుపు పూశారు. కొత్త కోక చుట్టబెట్టారు.

బలవంతాన నడిపించుకు వెళ్తూంటే - నారయ్య ఏమీ అనలేక-ఇంకేమీ చెయ్యలేక వాళ్ళ వెంట తనూ కదిలాడు అందరికీ భయమే మరి ఎంకన్నంటే.

నారయ్య వెంట తనూ కదిలింది— సీతాలు.

సింగిని—ఎంకన్న గుడిలోకి తీసుకెళ్ళారు.

ఎంకన్న పాదాలకు మొక్కించారు.

తాము లెంపలేసుకున్నారు.

రావిచెట్టు నీడ—

రాతిబొమ్మ చెంత—

నల్ల త్రాచులవంటి జడపాయలు ...

జాలిగా నేల మీద నీడలా పరచుకుంటూంది సింగి శిఖ.

నిశ్చేష్టుడై మిగిలిపోయాడు నారయ్య.

సింగి తల నీలాలు-సీతాలు ఏరింది.

"ఎంకన్నా! నీ మేలు మరచిపో నా కాపురం నిలబెట్టిన దేముడివి నువ్వు.

దణ్ణం పెడుతూ విజేతలా నవ్వింది సీతాలు.

ఆమెకు తెలుసు—శిగ లేని సింగిని చూసి దేముడూ మోజు పడడు. మనిషీ మోజు పడడు.

నారయ్య సంగతి ఆమెకు తెలుసు

ఇక సీతాలుకే దిగులూ లేదు.




## పూర్ణా ఆర్టు పిక్చర్సు
## కూతురు కోడలు

ఘోరమైన రైలు ప్రమాదం జరి గింది

ఎక్కడో - ఎక్కడో అనుకొనేరు. మరెక్కడో కాదు, పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ "కూతురు-కోడలు" కథలో

ఆ ప్రమాదానికి ఎందరో బలి అయ్యారు. కొందరు గాయపడ్డారు. కాని ఒకే కుటుంబంలోని సభ్యులు ప్రాణాలతో బ్రతికి బయట పడినా—ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు—అంతా చెల్లా చెదరయి పోయారు. కుటుంబం అయితే చెదరిందే గాని, వారి జీవితాలు చెక్కు-చెదర్లేదు గదా! అందరూ తలా వొక పుట్టా గట్టూ చూసుకొని బ్రతకటం ఆరం భించారు. అలా బ్రతుకుతూ-బ్రతుకుతూ పెద్దవారయ్యారు

చిత్రం ఏమిటంటే, తప్పిపోయిన అన్నా-చెల్లెలు పెద్దవారయి, కలుసుకొని, ఒకేచోట వున్నా, ఒకర్ని గురించి మరొకరికి తెలియకుండానే వుండి పోతారు అఫ్ కోర్స్! చివరకు అందరూ తెలుసు కొంటారనుకోండి ఇది పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ "కూతురు-కోడలు" రహస్యం,

జులై 23 వ తేదీన విడుదలయే యీ చిత్రం గురించి ఆ కబురూ, యీ కబురూ వినేందుకు పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ కార్యాలయంలోనే నిర్మాతలయిన పూర్ణచంద్ర రావుగారిని, చంద్రశేఖర్‌గారినీ కలిశాను ఇద్దరూ హుషారయిన వారే! పిక్చర్స్ గురించి ఆపాదమస్తకం క్షుణ్ణంగా 'స్టడీ' చేశారు (కొందరు నిర్మాతలకు పిక్చర్ పూర్తవుతున్నా 'స్టోరీ' ఏమిటో తెలియ దెక్కడ).

"ఏమిటి-మీ పిక్చర్ కబుర్లు?" అని అడిగాను

అడిగిందే తడవుగా చాలా-చాలా కబుర్లు చెప్పారు, అవీ

* ఇందులో హీరో శోభన్‌బాబు ఎంతో కొత్తదయిన వేషం చిత్రం అంతా ఆయనే! ఈనాడు అందరి ప్రేక్షకుల మనస్సుల్లోనూ వుంది ఆయనేగా!

* పోతే, మన కామెడీ స్టార్ గీతాంజలికి యిందులో ఎంతో సెంటిమెంటల్ కారెక్టర్ ('ఇల్లాలు' మరిచి పోలేదుగా!) దొరికింది మంచి వెరైటీ కదూ!

* 'మా పిక్చర్ గురించి మేమే అట్టే



నూతన వధూవరులు చి॥ సురేంద్ర. చి॥ సౌ॥ సత్యవతి
(పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు కుమార్తె)

చెప్పకూడదు' అంటూ నవ్వుతూనే పూర్ణచంద్రరావుగారు "కూతురు-కోడలు" సంగీతానికి ఫస్ట్ మార్క్ యిచ్చేశారు. ఏడు పాటలు వున్నాయి. ఏడూ హిట్ సాంగ్సే! మహదేవన్ స్వరకల్పన కదా మరి!

• దీనికి మాతృక కన్నడ చిత్రం అయినా, కథకు ఎన్నో ఆపరేషన్లు చేసి, జాయింట్స్ వేసి "ఒరిజినల్ తెలుగు స్టోరీ అన్నంత బ్యూటిఫుల్‌గా చేశారు.

"మరి పూర్ణచంద్రరావుగారూ! మీ పిక్చర్లో హీరోయిన్ విజయ లలితగా

"అలా అనుకోవద్దు విజయలలిత 'సెక్స్ క్వీన్' గా వుంటుందని ఆశించకండి". ఇందులో ఆ అమ్మాయిది మంచి కామెడీ అండ్ సెంటిమెంటల్ రోల్" అన్నారు నిర్మాతలు.

పూర్ణచంద్రరావుగారంటే శత దినోత్సవ నిర్మాత అని అర్థం. "మాతృదేవత" వారి యిటీవల చిత్రం. మరి "కూతురు-కోడలు" ఎలా వుంటుందో "పిక్చర్ ఎలా వుందో మీరే చెప్పాలి. మా మటుకు మేము మా బాధ్యత చక్కగా నిర్వహించాం ఫలితాలు వేచి చూద్దాం అంటూ రాయన

అందరూ ఆర్టిస్టులు బాగా చేశారని
ర్త. చిన్న పెద్దలందరికీ మంచివేషాలు
29 కేం|ద్రాలలో విడుదలయే యీ
త్రానికి ముందుగా ట్రెయిలర్స్
గ్యాయి

నిర్మాత పూర్ణచంద్రరావు ఫిలిం పరి
మకు సుపరిచితుడే కొన్నాళ్ళు సహాయ
ర్శకుడుగా, మరికొన్నాళ్ళు ప్రొడక్షన్
ంట్రోలర్ ఎన్నో పిక్చర్లకు పనిచేసి
త్రనిర్మాణ సారాన్ని కాచి వడపోశారు
అందువల్ల చిత్రం బాగానే వుండే
ండాలి! అయినా త్వరలో చూడబో
న్నారుగా!

శోభన్‌బాబు, విజయలలిత, రామ్మో
న్, గీతాంజలి, హేమలత, ప్రభాకర
, విజయశ్రీ, అల్లు రామలింగయ్య,
వి చలం, సంధ్యారాణి ప్రభృతులు
ంచిన యీ చిత్రానికి దర్శకత్వం :
క్ర దీపక్, నిర్మాతలు పూర్ణచంద్ర
వు అండ్ చంద్రశేఖర్.

## శ్రీమంతుడు

బాక్సాఫీస్ దర్శకులు శ్రీ ప్రత్యగాత్మ
దర్శకత్వంలో విశ్వభారతి ప్రొడ
వారు నిర్మిస్తున్న చక్కని సాంఘిక
కం "శ్రీమంతుడు" షూటింగ్ కార్య
మం పూర్తయింది. త్వరలో రీ రికా
్ మొదలు పెట్టేందుకు సన్నాహాలు
్తున్నారు జూలై నెలలో విడుదల
కానున్న ఈ చిత్రంలో నాగేశ్వరరావు,
జమున, గుమ్మడి, సూర్యకాంతం, రమణా
రెడ్డి, రాజబాబు, రావికొండలరావు, జయ
కుమారి, ఝాన్సీ, సాక్షి రంగారావు,
మాస్టర్ ఆదినారాయణ, బేబీ శ్రీదేవి—
ముఖ్య తారాగణం

జి రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న ఈ
చిత్రానికి కథ, మాటలు ముళ్ళపూడి
వెంకటరమణ, పాటలు దాశరధి-ఆరుద్ర
కొసరాజు, సి నారాయణరెడ్డి, సంగీతం
టి చలపతిరావు, ఛాయ కె ఎస్ రామ
కృష్ణ, నృత్యాలు తంగప్ప, పసుమర్తి
కృష్ణమూర్తి, సుందరం, కళ జి వి
సుబ్బారావు, కూర్పు పి శ్రీహరిరావు.
ఈ చిత్రంలో మొత్తం పసందైన
పాటలు ఎనిమిది వున్నాయి సంక్రాంతికి యుగ
విడుదల.

## సుభాషిణీ ఆర్టు పిక్చర్స్ "అదృష్ట జాతకుడు"

ఇటీవల కథానాయిక వాణిశ్రీ-యింటి
సెట్‌లో రెండు పాటలు ఎన్. టి రామా
రావు, వాణిశ్రీలపై చిత్రీకరణ జరిపారు
వాటిలో ఒకటి ఘంటసాల పాడింది.
"ఎవరనుకున్నావ్, నన్నేమనుకున్నావ్"
అనేది కొసరాజు వ్రాశారు. రెండవది
సి నారాయణరెడ్డి వ్రాసిన "చిరు-చిరు
నవ్వుల శ్రీవారు, చిన్నబోయి వున్నారు.
ఇంతటి శ్రీమతి ఎదురుగ వున్నా కినుక

వేరు-రమ్మనరు'' అనేది సుశీల పాడింది ఈ రెండు పాటలతో పాటు మరికొన్ని ముఖ్య దృశ్యాలను కూడా ఈ సెట్లో దర్శకుడు శ్రీ హేమాంబరధరరావు ఎంతో హృద్యమంగా చిత్రీకరించారు.

ఈ చిత్రంలోగల మొత్తం ఆరు పాటల్లోనూ యింతవరకు నాలుగు పాటలు రికార్డు చేసి చిత్రీకరణ జరిపారు ఇందులోని పాటలు-దేనికదే ఒక ప్రత్యేకతను సంతరించుకుని, రసగుళికల్లా వున్నాయని విన్నవారు అభిప్రాయ పడుతున్నారు

సగానికి పైగా పూర్తి అయిన యీ చిత్రంలో ఎన్.టి రామారావు, వాణిశ్రీ ముఖ్య భూమికలు పోషిస్తున్నారు నాగభూషణం, పద్మనాభం, రామకృష్ణ, ధూళిపాళ, రావికొండలరావు, మిక్కిలినేని, అల్లురామలింగయ్య. సాక్షి రంగారావు, ప్రసాద్, సుమ, రాధాకుమారి, లక్ష్మీకాంతమ్మ. బేబి శ్రీదేవి, మాస్టర్ ఆదినారాయణ తక్కిన తారాగణం

కథ బాలమురుగన్, సంభాషణలు మద్దిపట్ల సూరి, ఆదుర్తినరసింహమూర్తి, పాటలు కొసరాజు, దాశరధి, సి నారాయణరెడ్డి, సంగీతం టి చలపతిరావు, కెమెరా శేఖర్-సింగ్, కళ బి యన్ కృష్ణ, కూర్పు బి గోపాలరావు, నిర్మాణ నిర్వహణ. కె మహేంద్ర, నిర్మాత, దర్శకుడు, కే హేమాంబరధరరావు.

ఆంధ్ర ప్రదేశ్ లో పూర్ణా పిక్చర్స్ ద్వారాను, మైసూరులో విజయా పిక్చర్స్ ద్వారానూ యీ చిత్రం విడుదల అవుతుంది

## 'ప్రేమలు-పెళ్ళిళ్లు'

వాణీ మూవీస్ వారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి ''ప్రేమలు-పెళ్ళిళ్లు'' అని నామకరణం చేశారు. ఈ చిత్రం యిప్పటికి ఎనిమిది రీళ్ళు తయారయింది

నాగయ్య, హరనాధ్, రమణమూర్తి, కె వి నాగేశ్వరరావు, చంద్రమోహన్, త్యాగరాజు, నల్ల రామ్మూర్తి, కె వి. చలం, రాజశ్రీ, అనిత, సంధ్యారాణి, జూనియర్ కాంచన, పుష్పకుమారి, సుమిత్ర, బేబీ సుమతి - ముఖ్య తారాగణంతో నిర్మిస్తున్న ఈ చిత్రానికి రచన, దర్శకత్వం జి కె మూర్తి బి ఏ, సంగీతం విజయా కృష్ణమూర్తి, ఛాయ సి జె మోహన్‌రావు నిర్మాత, శ్రీఅరుళ్ సెల్వమ్

## నేనూ మనిషినే

మోడరన్ థియేటర్స్ వారి 110వ చిత్రాన్ని తెలుగులో సర్వాంగసుందరంగా నిర్మిస్తున్న చిత్రం ''నేనూ మనిషినే'' సెన్సారుకు సిద్ధమవుతూంది.

''పాలరాతి మందిరాన పడతి బొమ్మ అందం——అనురాగ గీతిలోన అచ్చ తెలుగు అందం '' సి నారాయణరెడ్డి



విశ్వభారతి ప్రొడక్షన్స్ వారి ''శ్రీమంతుడు''లో
జమున, నాగేశ్వరరావు.

రచించిన పాటను కృష్ణ, కాంచనలపై సుమనోహరంగా చిత్రీకరించటం జరిగింది

అపూర్వ కథా సంవిధానం, మంచి సెంటిమెంటూ, సస్పెన్సూ గల యీ చిత్రంలో గుమ్మడి, కాంచన, కృష్ణ, సత్యనారాయణ, కె. వి. చలం, సురేఖ, శకుంతల. జయకృష్ణ, అల్లాజనార్ధనరావు, జి. వి. రామచంద్రరావు, పొట్టి ప్రసాద్, బేబీ శ్రీదేవి, బేబీ కుముదలు ముఖ్య భూమికలలో కనుపిస్తారు.

యీ చిత్రానికి సంభాషణలు రాజశ్రీ, పాటలు పి నారాయణరెడ్డి, కొసరాజు; సంగీతం వేదా, ఛాయ సి ఎ ఎస్ మణి, కళ ఎల్ వేణు, నృత్యాలు; జయరాం; కూర్పు: ఎల్. బాలు సాంకేతిక నిపుణులు. విడుదల: నవయుగ.

## జేమ్స్‌బాండ్ 777

మయూర్ మూవీస్‌వారు శరవేగంతో నిర్మిస్తున్న 'జేమ్స్‌బాండ్ 777' చిత్ర

నిర్మాణం శారద స్టూడియోస్‌లో శరవే గాన సాగుతోంది. మే నెలలో 12 రోజుల షెడ్యూలులో నాలుగు సెట్లపైన ఐదు రీళ్ళకు పైగా చిత్రం నిర్మింపబడింది. రెండు పాటల చిత్రీకరణ జరిగింది. ఔట్ డోర్‌లో కొన్ని భయంకర పోరాటాలు చిత్రీకరించబడ్డాయి, జూన్ యిరవై నుంచి నెలాఖరు వరకు జరిగిన రెండవ షెడ్యూలులో మరిరెండు పాటలను చిత్రీకరించ టమేకాక, చిత్రంలోని ముఖ్య సన్నివే శాలుకూడా చిత్రీకరణ జరిగింది.

శ్రీయుతులు యు. నాగేంద్రనాయుడు, బికులాల్ అగర్వాల్, జి. సి. గుప్తలు భారీయెత్తున నిర్మిస్తున్న ఈ చిత్రంలో కృష్ణ, విజయలలిత, రాజబాబు, సత్య నారాయణ, జ్యోతిలక్ష్మి, ఛాయదేవి, మున్నీ ప్రభృతులు తారాగణం.

కె. యస్. ఆర్. దర్శకత్వాన శరవే గాలతో తయారవుతున్న ఈ చిత్రానికి మాటలు విశ్వప్రసాద్, సంగీతం సత్యం, ఛాయ దేవరాజ్, సహకార దర్శకులు కిషన్ కిషోర్, చక్రవర్తి సాంకేతిక నిపుణులు.

ప్రెస్ రిలేషన్స్ గోపేటి. ఈ చిత్రాన్ని ఆగస్టు మొదటి వారంలో విడుదల చేయా లని నిర్మాతల సంకల్పం.

## మాతృప్రేమ

కన్నతల్లి కడుపున మమతే
కాలానికి లొంగనిది
కాలానిదో కన్నతల్లిదో
గెలుపన్నదే తెలియునది....

కాల గమనాన్ని సైతం ఎదిరించి ఓడించగల తల్లి బిడ్డల మమతలను భావ స్ఫోరకంగా వివరించే గంభీరమైన ఈ చక్కని పాట భానూ మూవీస్ వారి "మాతృప్రేమ" చిత్రంలో, ఓ హైలైట్ పాట.

పసందైన పాటల కవి ఆచార్య ఆత్రేయ రచించిన ఈ పాటను ఘంట సాల అద్భుతంగా పాడగా జూన్ 8 వ తేదీన విజయా గార్డెన్స్‌లో రికార్డింగ్ చేశారు,

ఈ పాటను బ్యాక్‌గ్రౌండ్ దృశ్యా లతో కొత్త రీతుల్లో చిత్రీకరించనున్నారు. శరవేగంతో నిర్మితమవుతున్న ఈ చిత్రం షూటింగ్ జూన్ 12 నుండి 21 వరకు మద్రాస్ అరుణాచలం స్టూడియోలో జరు గుతున్నది. సావిత్రి, శోభన్‌బాబు, చంద్ర కళ మొదలగువారిపై కొన్ని సన్నివేశా లను చిత్రీకరించనున్నారు,

జన్మ జన్మాలకు తీరని అనుబంధంగా తర తరాలుగా వస్తున్న తల్లీ బిడ్డల ప్రేమానురాగాలను దర్శకుడు శ్రీ టి. మాధవరావు కొత్తరీతుల్లో ప్రతిభావంతంగా చిత్రీకరిస్తున్న ఈ చిత్రంలో —

తల్లీ బిడ్డలుగా సావిత్రి, చంద్రకళ, హీరోగా శోభన్‌బాబు అద్వితీయంగా నటి స్తున్నారు.